Steam Turb Stations No. N. 45 / M. 3813

వెల ఒక అణా

102869

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

సంపుటము ౧౫ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౨ విక్రమసం॥ మాఘ శు॥ ౩ (౨౮-౪-౧౩౫౦ ఫ.) గురువారము సంచిక ౭౪

★ అమెరికాపై జపానుఆగ్రహము ★

★ సుభాషబోసుగారి ఆకస్మిక మాయం ★

# తాయిలెండు యుద్ధవిరామయత్నము

## జపానువారు రాయబారానికి పూనుట

### తాయిలాండు, ఇండోచైనాలసప్తతి

#### తాయిలెండు ఇండోచైనాలయుద్ధం

జనవరి ౧౬ వ తేదిరాత్రి కాంబోడియాలో విమానప్రతిఘాత శతఘ్నులుఅయిదు తాయివిమానాలను పడగొట్టినట్లు ఇండోచైనాగవర్నరు జనరలు ఎడ్మిరలుటీకూగారు ప్రకటనచేసిరి. జనవరి ౨౦ వతారీఖున కాంబోడియా సరిహద్దులోగాని లయోడియా సరిహద్దులో గాని తాయిసైనిక చర్యలుజరగలేదనిరి. ఫ్రెంచిఇండోచైనా గవర్నరుజనరలు డికూ జనవరి ౨౬ వ తేదినాటిప్రకటనలో కాంబోడియాలో తాయి సేనలుచేసినదాడి తరుమబడినదని తెలియజేసెను. ఈదాడి సాంగ్రామంగప్రాంతంలోని ఫ్రెంచిసరిహద్దుసేనలమీద జరిగినట్లు తెలుస్తున్నది.

జనవరి ౨౫ వ తేదిన వెలువడిన తాయిమిలటరీప్రకటనలో తాయి సేనలు అన్నిరంగాలలోనూ ముందుకుసాగుతున్నాయని తెలుపబడింది. పిసోఫోన్ అనేఫ్రెంచికోటమీద తీవ్రంగా ఫిరంగికాల్పులు జరిగినవట,

విమానదళ సహాయంతో తాయికొల్పబలం ఫ్రెంచిఇండోచీనాలో నిమాంగుకావోపట్టణాన్నిఆక్రమించాయని తాయిప్రభుత్వమువారు ప్రకటించిరి.

"యుద్ధరంగపు ఈశాన్యభాగంలో మెకాంగునదిపొడుగునా కాల్పులుసాగినవి. తాయిఅగ్రసేనలు బుధవారంనాడు మెకాంగునదిపైనున్న ఒకముఖ్యమైనపట్టణమగు చంపసాకును ప్రతిఘటనలేకుండాపట్టుకున్నవి. తూర్పు రంగంలో ఫ్రెంచిప్రతిఘటనను చెదరగొట్టి తాయిప్రధాన సేనలు విమానదళసహాయంతో కొన్నిముఖ్యమైన ఫ్రెంచిరక్షణ శ్రేణులలోనికికదలి పురోగమనం సాగించినవి"

జనవరి ౨౮ వ తేదినాటికి తాయ్ సేనలు అన్ని యుద్ధరంగాలలో ముందుకుసాగినవి.

తాయిలెండు, ఫ్రెంచి, ఇండోచీనాలమధ్య యుద్ధవిరామం జరుగుతుందని వచ్చినవార్తలు ఇప్పుడిప్పుడే నమ్మదగినవికావని ఈనాడు లయాన్సు రేడియో ప్రకటించినది. ఫ్రెంచిఇండోచీనానుంచి కడపటిసారిగా వచ్చినవార్తలు ఫ్రెంచి సైనికదళాలు తమ భూభాగంలోనికి చొచ్చుకువచ్చి తాయిసేనలను ఇంకా తుడిచివేస్తున్నట్లు తెలుపుతున్నవనికూడా ఇదేరేడియో ప్రకటించినది. లాయెస్, కాంబోడియా ప్రాంతాలలోనికి చొచ్చుకువచ్చిన తాయిసేనలనుతుడిచివేస్తున్నవి.

ఒకవైపు యుద్ధపాట్లుంప ఈరెండుదేశాలకు సంధికుదుర్చుటకు యత్నాలింకొకవైపు జరుగుచున్నట్లు కనపడుచున్నది.

జనవరి ౨౮ వ తేదినాడు తాయిలాండు ఫ్రాన్సులనడుమ జపాను మధ్యవర్తిత్వం వహించుననియు యుద్ధవిరామంజరిపి, ఇండో-చీనా, తాయిలాండు వివాదంలో జపాను మధ్యస్థం అంగీకరించాలని జపానుచేసిన ప్రతిపాదనకు రెండుప్రభుత్వాలుకూడా అంగీకరించాయనియు ౨౮ వ తేదిన టోకియోప్రభుత్వపు ప్రచురణశాఖ ప్రకటించినది.

(ఫ్రాన్సు, తాయిలెండు రాజ్యాలు జపాను మధ్యవర్తిత్వమును అంగీకరించినవి.

ఈలోపున తాయిపత్రికలు కొన్నిరూఢికాని వార్తలనుప్రకటిస్తున్నాయి వీటిప్రకారం ఫ్రెంచివారి సైయిగానులోని ఫ్రెంచి అధికారులు ఇండో-చీనా వర్తకనౌకలన్నిటికి ఫిరంగులు అమర్చుతున్నారనీ, పవిత్రమైన అంగుకోర్ శిథిలాలవద్ద విమానాలను యుద్ధసామగ్రులనూ రహస్యంగా చేర్చుతున్నారనీ తెలుస్తున్నది. వర్తకనౌకలకు ఆయుధాలు అమర్చడంగూర్చి ప్రశ్నించగా తాయి మంత్రివర్గంలోని ఒక సభ్యుడు "మాఓడలను మాయుద్ధనౌకలు రక్షించగలవు" అన్నాడు.

మిలిటరీపరిస్థితిని చర్చించడానికి బుధవారంనాడు మంత్రివర్గం సమావేశమయిందని ఇతడన్నాడు. "లాయోస్, కాంబోడియా ప్రాంతాలలో మేము ఆక్రమించిన భాగాలనువదలిపెట్టము. అనవసర రక్తపాతానికి ఇష్టంలేకపోవడంవల్ల మాపెద్ద సేనలను ఉపయోగించలేదు" అని ఇతడన్నాడు.

#### బ్రిటనుజర్మనీలయుద్ధము

బ్రిటనుపై జర్మనువిమానసంచలనం జనవరి ౨౦నాడు రాత్రిలేదు ౨౧ వ రాత్రి చాలాప్రొద్దుపోయినతర్వాతకొద్దిగావచ్చినవి.

౨౨ వ తేదిన బ్రిటిషువారు రెండుశత్రువిమానాలను ధ్వంసముచేసిరి

జనవరి ౨౪ వ తేదిన షబిన్-కౌజిల్ లో భయంకరమైన అగ్నిప్రజ్వరిల్లి విశేషనష్టాన్ని కలిగించింది.

సెయింటుపాట్రిక్‌భవనమూ, ఆక్కడవున్న ఇతరఉద్యోగుల కార్యాలయాలూ, పార్లిశామికశాఖామంత్రికార్యాలయమూకూడా ప్రమాదపరిస్థితిలోఉండెను,

శత్రువిమానములదాడికి గురియై నలిగిపోగల కొన్నియిండ్లనుండియు ప్రదేశములనుండియు ౧౫౦౦౦౦ ప్రజలనుఆంతకంటె సురక్షితమైన స్థానాలకు తీసుకొనిపోయినారు,

బ్రిటిష్‌డిస్ట్రాయర్ 'హెపీరియన్' నష్టమయింది. టార్పెడోవల్లనో, మందుగుండుగనివల్లనో దెబ్బతగిలింది. అందువల్లప్రయాణంచెయ్యజాలనందున బ్రిటిష్‌యుద్ధనౌకలుదానిని ముంచి వెళ్లినవి

రెండు బ్రిటిష్‌టాలర్లుముంచబడినవి. మొదటిదానిలో ఎవరూ చనిపోలేదు. రెండవదానిలో మాత్రం కొందరు చనిపోయారు,

బ్రిటిషువిమానాలు జనవరి ౨౨,౨౩వ తేదీల రాత్రులందు సిసిలీలోని విమానాశ్రయంపైన తీవ్రమైనదాడులు జరిపినవి. కోమిసోవద్దమంటలబాంబులుపడి పేలుళ్లు సంభవించినవి.

జనవరి౨౪వ తేది సాయంత్రం మధ్యధరాసముద్రంలో జర్మన్ విమానాలు బ్రిటిష్‌నౌకావ్యూహంమీద దాడిచేసినవి. "మొదటవచ్చిన వార్తలప్రకారం ఒకబ్రిటిషుక్రూయిజరు వెనుకభాగంమీద పెద్ద బాంబుపడినది, అట్లాంటిక్‌లో ఒక ఇటాలీయుజలాంతర్గామి ఒకగ్రీసుఓడనుముంచింది ఇంకొక ఇటాలియన్ జలాంతర్గామి బ్రిటిషుసహాయక్రూయిజరును ముంచిందట. ఈ నౌకనిండా సేనలుఉన్నవి,

ఈసంగతినిగూర్చి బ్రిటిషువారు మామూలువలెనే యుద్ధనౌకలు శేషంలో ఏమీ చేయలేక ప్రకటించలేదనిరి.

## సూయెజ్ కాలువ ప్రాంతంపై జర్మన్ విమానం

ఒక జర్మన్ పర్యాలోకనవిమానం మెడిటరేనియన్‌లోని ఒకవిమానాశ్రయం నుండి బయలుదేరి సూయెజుకాలువ ప్రాంతంమీద సంచారం చేసిందనీ, రెండుసార్లు పెట్రోలునింపుకొన్నదనీ జర్మన్ రేడియో ప్రకటించింది.

మొదటిసారి ఒకలిబియా విమానాశ్రయంలో దిగి ఈవిమానం పెట్రోలునింపుకున్నది,అచ్చట ఇంకలివైమానికులు ఇటాలీయఅధికారులనుండి సలహాలు తీసుకున్నారు. మరలిరావడానికి పెట్రోలుచాలనందున ఇంకొక ఇటాలీయ విమానాశ్రయంలోదిగి పెట్రోలునింపుకొని ప్రయాణం పూర్తిచేసెను.

#### ఆఫ్రికాలో ఇటలీ, బ్రిటనుల యుద్ధము

బ్రిటిష్‌సేలలు లిబియాకు పడమరగా పోవుచు ౨౫వ తేదినాటికి డేర్నాలో ప్రవేశించినవి.

బ్రిటిష్‌సేనలు ఇటాలీయ సోమాలిలాండ్‌మీదకూడా దాడిచేసినవి, ఇటలీకిచెందిన ఆఫ్రికా సామ్రాజ్యం అంతటిమీదనూ ఇప్పుడు బ్రిటను దెబ్బతీస్తున్నదన్నమాట.

ఎరిత్రియాలో ఇటాలీయన్ సేనలుకేరూకో టాప్రాంతాలను ఖాళీచేసి పలాయనంసాగించినది. ౨౫వ తేదినాటికి బ్రెషియాపట్టణము పట్టుకొన్నవి.

అబిసినియాలో టానాసరస్సుకు తూర్పు దక్షిణదిక్కులలో అబిసీనియా దేశభక్తదళాలు తీవ్రంగాపోరాడి శత్రువులకు అపారనష్టం కలిగించుచున్నవి. కెన్యా సరిహద్దున చాలాభాగంలో చురుకుగా గస్తీ సంచారం జరుగుచున్నది.

ఆఫ్రికాలోని అన్ని వైపుల బ్రిటిషువిమానాలు శత్రువులకు నష్టముకలిగించు తీవ్రములైనదెబ్బలను వేయుచున్నవి.

తూర్పుఆఫ్రికాలోవున్న ఇటాలీయసైనికుల, పౌరులభవిష్యత్తు ఏవిధంగా వుంటుందోనని ఇటలీలోని ఫాసిస్టువర్గాలవారు చాలా ఆదుర్దాపడుతున్నారు. వీరు తమకష్టసుఖాలను తెలియజేసుకోటానికివున్న ఒకేఒకసాధనం రేడియోమాత్రం ఎప్పుడో. సకృతు గాలిబ్యా నుంచి ఒకవిమానం రావచ్చు. సైనికులకు పరికరాల కొరత ఏర్పడ్డది. ముఖ్యంగా పెట్రోలులేదు. స్థానికప్రజల ప్రతికూలచర్యలఫలితంగా త్వరలోనే ఆహారపదార్థాల కరువుకూడా ఏర్పడవచ్చు.

ఈ వలసరాజ్యంలో ఇటాలీయులకు బాధా విముక్తిచేకూర్చడానికి ఇటాలీయులతోపాటు జర్మనులుకూడా ఎత్తులువేసి సహకారంచేస్తున్నారు. సత్వరంగా ఈవిముక్తిచేకూరడంఅత్యవసరం తర్వాత ఎన్ని యోచనలు చేసినా ప్రయోజనంఉండదు

ఇక నౌకాయుద్ధాల సంగతి, ఒక ౭వేల టన్నుల ఇటాలీయ సామగ్రినౌకను బ్రిటిష్‌జలాంతర్గామి ముంచినది.

ఇటలీకిదక్షిణంగా మధ్యధరాసముద్రములో ఈసంఘటనజరిగింది. ఇటాలీయనౌకనిండా ఉత్తరఆఫ్రికాకు వెళ్తున్నా సైనికులు ఉండెను.

యంత్రదళాన్ని చూసుకొనిపోవుచున్న ఒక ఇటాలీయనౌకను ఒకజలాంతర్గామి వేటాడియుంచివేసిందనియునో స్టోవిమా రావ్సికైన హెర్జీగోవినానుంచివార్తలు తెలుపుచున్నవి.

ఇదిఇట్లుండగ విశేషసంఖ్యలలో జర్మన్ సైనికదళాలు దక్షిణ ఇటలీలోకివచ్చి వుడుతున్నవి. ఇంతేగాక జర్మనులుఇటాలీయన్ సైన్యాలపైనిఅధికారంవహిస్తున్నారు అనిప్రకటనద్వారా తెలియవస్తున్నది. ఈజర్మనుసైనికదళాలు కదలికను సురుగుపరచడానికిగాను ఇటలీలో ప్రత్యేక చర్యలను జరపడమవుతున్నది.

ఉత్తరఇటలీలో ముఖ్యంగా మిలాన్ ట్యూరిన్ నగరాలలో తీవ్రమైనదొమ్మీలు సంభవించినవి, జర్మన్ సైనికబలాలు వాటిని అణచివేసి భద్రతనుచేకూర్చినవి.

ఉత్తరఇటలీలోవున్న ప్రజలలో నూటికిపదివంతులుకూడా ముసోలినీచర్యలను ఆమోదించరని ఒకఇటాలీయన్యాయవాది సీనార్ అస్కార్ కెల్లర్ "చించినాటీ" ఆనేపత్రికలలో వ్యాసంలో వెలిబుచ్చినాడు. అస్కార్, కెల్లర్ ఇటీవలనే అమెరికాకువచ్చినాడు.

"హస్యపోలీసుదళాల సంఖ్యఇటీవల రెట్టింపుఅయింది- కానిఈరహస్యపోలీసు దళాలను చివరకు ప్రభుత్వంకూడా నమ్మలేకపోతున్నది. ఇటాలీయసైనికులు వేలకువేలమంది బ్రిటిష్‌వారికి ఖైదీలుగాచిక్కుతున్నందుకు వారుసంతోషపడుతున్నారు. ఇదేవిధంగా అభివృద్ధి చేకూరినట్లయితే త్వరలోనే యుద్ధంఆగిపోతుందని ఈసైనికులుఅభిప్రాయపడుతున్నారు.

"ఒకవేళఇటాలీయులు ఈయుద్ధంలోగెల్చినప్పటికి ప్రయోజనంలేదని పర్యవసానంగా జర్మనీఇటలీని కబళించివేయగలదని అనేకమందిఇటాలియన్లు అభిప్రాయపడుచున్నారు." అనిఅతడు ఆవ్యాసంలో వ్రాసినాడు.

#### అమెరికా సహాయానికై బ్రిటనువిజ్ఞప్తి

"౧౯౪౧లో యుద్ధం సముద్రాలలోజరుగుతుంది. బ్రిటన్ త్వరగాజయించడంవల్ల తనకుఎంతలాభంవుంటుందో అమెరికా తనమట్టుకుతాను నిర్ణయించుకోవలెను. ఎన్నివిధాలుగాఎంతవరకు మాకుసహాయంపంపించవచ్చునో అదికూడవారేనిర్ణయించుకోవలెను. అనిజనవరి౨౫వతేది లండనునుండి బ్రాడ్‌కాస్టుచేస్తూ రోనాల్డు క్రాస్‌గారు అమెరికాప్రజలకుచెప్పనారు.

"సరుకు సరఫరాచురుకుగా జరిగిందంటే సగంయుద్ధంపూర్తిఅయినట్లే

బ్రిటిషునౌకానిర్మాణశాలలు జోరుగాపనిచేయుచున్నవి. అయితే,బ్రిటనుకు ఇంకాఎక్కువనౌకలఅవసరంఉన్నది. గతయుద్ధంలో జర్మనీతనప్రాంతాలనువిడిమాత్రమే జలాంతర్గాములను నడుపగలిగింది.

## సుభాష్‌బాబుగారిపై వారంటు, ఇంటిపరిశోధన.

కలకత్తా చీఫ్‌మెజిస్ట్రేటుగారు సుభాష్‌చంద్రబోసుగారిని ఫిబ్రవరి౫వ తేదిలోపల అరెస్టుచేసి ప్రవేశపెట్టవలెనని వారంటులో ఆజ్ఞనిచ్చినారు.

రక్షకశాఖవారు సుభాష్‌గారి ఇంటిని జనవరి ౨౭వ తేది రెగంటలవరకు శోధించి వారిసేవకులయొక్కయు, ఇంటివారియొక్కయు వాఙ్మూలములువ్రాసికొనిరి.

అరవిందఘోషుగారి ఆశ్రమనివాసులైన ఒకరు సుభాష్‌గారక్కడికి రానట్లుపాండిచ్చేరి టెలిగ్రాముద్వారా శరత్చంద్రబోసుగారికి తెలిపిరి.

సుభాష్‌చంద్రబోస్‌గారు జనవరి౧౬వతేదిన చాలాసేపువరకు మిత్రులతో, ఇంటివారలతో మాట్లాడినారనియు, వారలువెళ్లినప్పుడు ఆదేకడపటిసారి కనబడుటయైనట్లును తెలిసినది. వారలు జరిగి వివరముగా కనుగొనుటకుప్రయత్నించ తెలుపుటకు నిరాకరించిరట

## నిజాంకాలేజి వార్షికోత్సవము

హైదరాబాదుదక్కన్ జనవరి౨౯

హైద్రాబాదునగరములోని నిజాంకాలేజి వార్షికోత్సవము గతశనివారమునాడు జరిగెను ఆసందర్భములో ప్రిన్సిపాల్‌గారుచదివిన నివేదికలో యీక్రిందివిషయాలు గమనింపదగ్గవి.

ఈకాలేజలో హైస్కూలుశాఖయున్నప్పటికి మరిశాఖయున్న కలవు.అన్నింటిలోసంఖ్య ౭౦౪ అందు ౩౯౦ కాలేజిలో ౧౫౪ హైస్కూలులోను ౧౬౦ప్రెయిమరులోను కలరు. కాలేజిలోని ౩౯౦మందిలో ౧౩౭ముస్లిములును ౨౦౩హిందువులును౩౭స్త్రీలును, ౧౭క్రైస్తవులును, ౨౫పార్శీలునుకలరు సర్కారీపరీక్షలలో నూటికి౭౦మందివంతున కడతేరినారు.

౧౩౭మంది విద్యార్థులకు సహాకారవేతనములిచ్చినారు.

కళాశాలలపై ౨౪౯౦౩ రూపాయలువ్యయమైనవి.

అయితేఒకగొప్పలోపమేమన కళాశాలలో ౩౦౦ మందికంటే ఎక్కువచేర్చుకోకూడదని ప్రభుత్వమువారు నిర్బంధించినారు. అందుచేత ఏటేటను మూడురెండువందలమందిని చేర్చుకొనక తిరుగగొట్టవలసివచ్చినది.

# భారతదేశస్వాతంత్ర్యమార్గము

## మరల అమెరీగారిప్రాతముచ్చట

భారతదేశమునకు సెక్రెటరీఆఫ్ స్టేటుఅగు యల్. యస్. అమెరీగారిని జనవరి ౨౩వ తేదిన “గ్రేటుబ్రిటను అండ్ దిఈస్ట్”అను ఇంగ్లీషుపత్రికయొక్క సంపాదకుడగు సర్ ఆల్ఫ్రెడ్ వాట్సన్ గారు సందర్శించిభారతదేశస్వాతంత్ర్యం సిద్ధించుటెట్లు అనువిషయమునుగూర్చి కొన్నిప్రశ్నలడిగిరి. వాటిసమాధానముగ అమెరీగారు చెప్పినఅభిప్రాయములు ఈక్రిందివిధముగనున్నవి.

బ్రిటిషుప్రజల అభిప్రాయములకుగాని అపేక్షితములకుగాని తగినట్లు బ్రిటిషుపార్లమెంటుచే శాసితముగాక భారతీయులఅభిప్రాయములకు తగినట్లు నిర్ణీతమైన రాజ్యపాలనపద్ధతి కావలెనని అనేకులు భారతీయులుకోరుచున్నారు. భారతప్రభుత్వమువారి వ్యవహరణవిధానము ఆకోరికనుతీర్చినది. ఇపుడుదేశమును శత్రువునుండి రక్షించవలసిన అవసరమున్నది. ఎక్కువగాఅందువల్ల ఏర్పడిన కొన్నిఅటంకములు, తర్వాత భారతదేశమందలి సంస్థానములకును, ప్రభుత్వోద్యోగములయందు ఇపుడున్నవారికిని వాగ్దానముచేసినవిధులుతప్ప మరేదిగాని, యుద్ధముముగిసినతర్వాత భారతీయులకు సాధ్యమైనంతఎక్కువ పరిపాలనాధికారమునిచ్చు రాజ్యాంగమును అటంకపెట్టునట్టిది లేదు.

ఇకవెంటనే జరుగవలసినదానివిషయములో, స్వాతంత్ర్యసమస్యలో స్వతఃగాఉండుచిక్కులను గ్రహించి పరిష్కరించుటకును, ఏదిలేనిచో భారతదేశములోపల శాంతిగాని బయటినుండి శత్రువులదాడి భయములేకుండుటగాని అసంభవమౌ అఖండత్వమును చెదరకుండఉంచి భారతీయులలో ప్రధానశాఖలవారలు తమతమమతములప్రకారము తమతమసంస్కారములను, ఆచారవ్యవహారములను పోషించుకొనవచ్చునను అభయమునిచ్చునట్టి ఒకపద్ధతినికనుగొనుటకును ఇపుడులభించినఅవకాశమును భారతీయనాయకులెట్లు వినియోగించుకొందురనుదానినిబట్టి చెప్పవలసియుండును.

అసలు నిజమైనచిక్కుయిది. బ్రిటిషువారినుండి భారతీయులకు అధికారమును ఇచ్చివేయుపవిషయంటె ఇదిచిక్కైనది. బ్రిటిషువారినుండి భారతీయులకు నీవలెనావద్దా అనితర్కించువారులేరు. ఏవిధముగాపరిపాలనాధికారమును బ్రిటిషువారినుండి భారతీయులకు సంక్రమింపజేయవలెననువిషయములోకూడ దాటరానిచిక్కు ఏదియుఉండజాలదు.

ఉండెడిచిక్కులలోకెల్ల పెద్దచిక్కు భారతీయులకు పరిపాలనాధికారమును సంక్రమింపజేసినతర్వాత ఆయధికారమునుచేబూని విచ్ఛిన్నముచేసికొనకుండ దేశములోక్షోబలు లేకుండవినియోగించగల భారతీయప్రభుత్వము ఉండుట అవసరము, అసలువిషయమేమనగా భారతదేశములో శాంతిని క్షేమమునురక్షించుభారము బ్రిటిషుప్రభుత్వమునకు సంక్రమించి చిరకాలానుభవములోఉన్నది, అట్టిభారమును భారతీయులలో ముఖ్యులును, ఎక్కువజనసంఖ్యగల వారలును అగుశాఖలవారలు ఒకరిపైనొకరు ఈర్ష్యతో పోరాడుకొనుచు అందులో మాకధికారముండవలెనంటే మాకుండవలెనని కొట్లుకొనునంతదూరమువరకుకూడ ఏపరిపాలనపద్ధతివల్లఫలించునో అట్టి పరిపాలనపద్ధతిపై వదలిపెట్టజాలము

ఈచిక్కును భారతీయులే తీర్చుకొనవలెను. వారలే భారతదేశపు అఖండత్వమును చెడకుండ వివిధశాఖల భారతీయుల అపేక్షితములుతీరునట్టి ఉపాయమును కనుగొని, దానిప్రకారమాచరించుటకు తగిననియమములను నిర్ణయించవలసినవారలైయున్నారు. అదంతయు భారతీయులలో చిన్నశాఖలవారలు తమలో తాము చేసికొనవలసిన పని.

భారతప్రభుత్వమువారు యుద్ధప్రయత్నములయందు భారత రాజకీయనాయకులకు గొప్పభాగమును ఇచ్చెదమనుటయేగాక, ఏపరిస్థితులలో రాజ్యాంగసమస్యను ఇప్పటికంటె ఎక్కువ ఆశతో పరిష్కరించవచ్చునో అపరిస్థితులు కల్గించుటకు అవకాశమునుకూడ ఇచ్చెదమనిరి. మేము యావత్ప్రపంచముయొక్క భవిష్యత్తుకొఱకై చావుబ్రతుకుల నిర్ణయమునకై పోరాడుచున్నపుడు పరిపాలన కార్యనిర్వాహకవర్గములో భారతీయులు ఎక్కువమంది యుండుటకై సభ్యులసంఖ్యను హెచ్చించుటకు సిద్ధపడుటయన బ్రిటిషుప్రభుత్వము నిజముగా చాలదూరము భారతీయులవాంఛను తీర్చినదనియేచెప్పవచ్చును. యుద్ధముమధ్యలో భారత ప్రభుత్వముయొక్క మూలమునంతయుమార్చి. ఇపుడు యుద్ధభారమును నిర్వహించుచున్నదానికి మారుగా పూర్తిగా క్రొత్తప్రభుత్వము నేర్పాటు చేయుట ఎంతమాత్రము చరణసాధ్యము కాదు.

అట్లు పెద్దదిగచేయబడిన పరిపాలన కార్యనిర్వాహకవర్గములో అందరును ఒకమాటకు కూడిరారనిగాని, లేదాదానిసభ్యులకు ముఖ్యములైన పరిపాలనకార్యము లుండవనిగానిచెప్పుట పొరపాటు, అట్టికార్యవర్గమువారిమాట బ్రిటిషు ప్రభుత్వమువారు సులువుగా త్రోసివేయగలమాటగా నుండజాలదు. మరియు ఒక లాభమేమన ఈపెద్ద కార్యవర్గము తాత్కాలికఅవసరమునకై ఏర్పడినను స్థిరముగా నిలచియుండగలదు. ఇప్పటికిని ఈసూచనలకు ఒప్పుకొనువారు ఒప్పుకొనవచ్చును. నాజీలు, ఫాసిస్టులుగెలిచినచో భారతీయుల ప్రతికోరికయు భగ్నమగునుకాబట్టి ముందు నాజీఫాసిస్టులనోడించుటకై యత్నించుట వివేకము. రాజకీయసమస్యవేరు, రాజ్యాంగ నిర్ణయసమస్య వేరు.

---



## గ్రామాలలో వయసుపెద్దల విద్యకై కాంగ్రెసు వాలంటీరులు

మదరాసురాష్ట్రమందు మాయవరములో జనవరి౯వతేదిన ఆర్. కృష్ణమూర్తిగారి అధ్యక్షతన కాంగ్రెసువాలంటీరుల మహాసభ జరిగెను. పూర్వము మదరాసుమంత్రులలోనొకరుగ నుండినట్టి యస్. రామనాథన్ గారు సభను ప్రారంభించిరి. వారు సత్యాగ్రహమునందు జనులు ఉత్సాహము గలిగియున్నందుకు సంతోషించిరి. అయితేదేశముయొక్క ఆర్థికదాస్యమునుతొలగించుటకై జనులు నిర్మాణ కార్యక్రమమును జరిపించవలెననిరి. గ్రామములో చిన్నపరిశ్రమలు వృద్ధిచెందినచో నేటికాలపు ఆయుధములవల్ల ఎట్టిఉపద్రవముగాని కలుగదనిచెప్పిరి. నిర్మాణ కార్యక్రమమందు వయస్సుమీరినవారలకు విద్యనేర్పించుటయు ఒకముఖ్యాంశము రష్యాలో ౨౦ ఏండ్లక్రింద నూటికిరగురుమాత్రమే వయస్సు ముదిరినవారలలో అక్షరాస్యులైయుండిరి. ఇపుడు అందరును అక్షరాస్యులై యున్నారు. కాంగ్రెసు వాలంటీరులు తమపనిని సరిగాచేసినచో మనముకూడ కొద్దికాలములో అట్టిఫలితములనే సాధించగలమని రామనాథన్ గారు చెప్పిరి.

అధ్యక్షులవారు ఉపన్యసించుచు ఇపుడుజరుగుచున్న సత్యాగ్రహములో ఒక్కొక్కసత్యాగ్రహియు ౬వేలమంది భారతీయులప్రతినిధియైయున్నాడనిరి.

సభవారామోదించిన తీర్మానములలో గాంధి మహాత్ముని నాయకత్వమునందు విశ్వాసము, అన్నామలై విశ్వవిద్యాపీఠపు సంఘటనల దూషణము, అసంఘటనలనుగూర్చి విచారణ జరుపవలెననుకోరిక, ఖద్దరుప్రోత్సాహము, జెయిళ్ళలో రాజకీయఖైదీలకు చేయుచున్న ఆదరణదూషణము గలవు.

---

## కొల్హాపూరుమహారాజుగారి రు. ౧౫ లక్షల గుఱ్ఱము

కొల్హాపూరుమహారాజుగారి “గ్లోరీఆఫ్ ఇండియా” అనేగుఱ్ఱమునకు సాధనచేయించి పందెములోనికిదింపగా, అది క్రిందపడెను. అందుచే దానికూపకము (కడుపుభాగపు అస్థిపంజరము) విరిగెను. అందువల్ల ఆగుఱ్ఱమును నాశము చేయవలసివచ్చినది. ఈగుఱ్ఱమును రూ ౧౫లక్షలకు బరోడామహారాజాగారికిచ్చెద మనియుండిరట!

---

## మానుకోట

### గ్రంథాలయదుస్థితి

ఈగ్రామములోని శ్రీ కృష్ణగ్రంథాలయము క్షీణదశకువస్తూవున్నదనివింటున్నాము. కొన్నిదినములక్రితము కొందరుప్రముఖులు తాము గ్రంథాలయాభిమానులుగానటించి అమాయకులగు ప్రజలనుమోసపుచ్చి గ్రంథాలయముపేరుమీద దసరాభిక్షయను నెపముచేతత్సంస్థయొక్క అనుమతిపొందకుండానే చందారూపముగా ఒకపట్టివేయించి కొంతడబ్బువసూలుచేసినారనిన్నీ మిగిలినడబ్బు వసూలుకాలేదన్న నెపముచే వసూలుఅయ్యినచందాయున్న అపట్టియున్న తమవద్దనే రమారమిమూడునెలలనుంచి యుంచుకున్నారనివినవైనది. దీనివలన గ్రంథాలయాధికారులు ఆలోచించలేదుకాబోలు. పైగాఎవరో గ్రంథాలయాభిమాని అకాలదోషము పట్టిన పట్టికొరకు కాళ్లువాచేటట్లుతిరిగి అపట్టిలోనుంచి కొన్నిచందాలువసూలుచేసి గ్రంథాలయములో జమకట్టించగా పాపము ఆఅమాయకున్ని చీవాట్లుపెట్టి గ్రంథాలయములోనుండి అపట్టికిసంబంధించినడబ్బుకూడ వాపసుతీసుకున్నారు. గ్రంథాలయమునకైనను, గ్రంథాలయపీసభ్యునికైనను అచందావిషయమై ఏమాత్రముఅధికారముమరియు సంబంధములేదని అప్రముఖులువాదించుచున్నారు, సంస్థయొక్క అనుమతిపొందకుండానే, అసంస్థపేరుమీద చందాలువసూలుచేయుట ఎంతవరకుఉచితమో అప్రముఖులు ఆలోచించెదరుగాక. ఈవిధముగా ప్రతివాడు ఒకసంస్థపేరుమీద చందాలువసూలుచేసి నెలలపర్యంతరము తమయొద్దవుంచుకొన్నయెడల అసంస్థయొక్క స్థితి ఏవిధముగానుండునో ఆలోచించెదరుగాక.

యాతవాకిళ్ళ విశ్వనాధం

## బోసుబాబు జన్మదినోత్సవము

(ఒ.వి)

ఖమ్మంమెట్టు, ౨౩ జనవరి

నేడుయీగ్రామమందు బోసుబాబు జన్మదినోత్సవము అతివైభవముగా జరుపబడినది. సాయంత్రము ౬గంటలకు జరుపబడినసమావేశమునందు పౌరులనేకులుపాల్గొనిరి. శ్రీవారి జీవితచరిత్రను సభికులకు అనేకమంది ఉపన్యాసకులచే ఎరింగించబడెను. అల్పాహారవిందుతో సమావేశము జయప్రదముగాముగిసెను.

## భువనగిరి

### లోకల్ఫండు కమిటీ

(స్వ. వి.) ౨౧-౪-౧౩౫౦ఫ.

ఇక్కడ లోకల్ఫండుకమిటీ స్థానిక దువ్వం తాలూక్దారుగారి యధ్యక్షతన తహశీలుదారుగారి కార్యదర్శిత్వమున కొందరుసభ్యులుగలరు. ప్రజాపక్షపుసభ్యులుగలరుకాని, వారిని ఎవ్వరు నిర్ణయించినది? ఎప్పుడు నిర్ణయించినది? వారెవ్వరో? ప్రజలకు తెల్యదు. కావున తొందరగా ప్రజాహితముకోరు కొత్త ప్రజాసభ్యులను నియమించి పూర్వపుసభ్యులను మార్చగలరని కోరిక.

సుమారు ౩౫౦౦గృహ సంఖ్యగల గ్రామములో ప్రేళ్ళమీద లెక్కచేయున్న పాకీదొడ్లు (పాయఖానాలు)ఉన్నందున ప్రజలుతడబడుచుండ పాకీదొడ్డిచాకలివాడలో జంగమువారిమఠము (ఆలయము)వద్ద నిర్మించినారు. రహదారీత్రోవ నడచువారికి దుర్గంధమునోవాసనగలుగుచుండును. మురికినీరుపోవు మోరీలు గ్రామములో ఎక్కడ ఎక్కడ యుండవలయునో అక్కడసరిగాలేవు, ఉన్న వాటిపరిశుభ్రత సరిగాలేక దుర్గంధము గలుగుచుండును.

పారిశుధ్యవిషయముగూడఅంతే. చెత్తపోసియు కుండీలుఎక్కువలేవు, ఉన్న కుండీలలోనున్న చెత్తనుకొన్ని సఫాయిబండ్లవాండ్లు నల్లగొండచౌరస్తతూర్పుగమినివద్ద పోయుచుందురు. అక్కడ శ్రీ హనుమదాలయముగలదు ప్రతిసంవత్సరము చెత్త(పెంటలు) ఎరువుకొరకుగాను హర్రాజు చేయుదురు. పెంటకొరకుగాను త్రవ్వుచు మరల కొత్తచెత్త అక్కడ పోయుచుండుటముచేత దేవాలయమువద్ద అపరిశుభ్రత నిండియుండుటచే చూచువరలకు అసహ్యముగా దోచుచుండును,

## మిర్యాలగూడెం

### వైశ్య యువజనసంఘ సభ్యుని అకాల మరణము

(ఒకవిలేఖరి) ౧౯-౪-౧౩౫౦ఫ

ఇచ్చట మాపురంబున ౧౫-౪-౫౦ఫ. తేదిన దేశహితవాంఛ తత్పరుండును, ఖద్దరుదీక్షా వ్రతుడును స్థానిక వైశ్య యువజనసంఘ సభ్యుడునగు, పిన్నవయస్కులగు శ్రీయుత కర్నాటిలింగయ్యగారి అకాలమృత్యువు ఈపురజనులందరిని దుఃఖమున ముంచివేసెను. వీరిఈమరణమునకు సానుభూతినిమిత్తమై ఇచ్చటి వైశ్యసోదరులెల్లరు తమ తమదుకాణముల ఆరోజున మూసివేసిరి.

## కమ్మహాస్టలు

ఖమ్మం, జనవరి ౨౫

కమ్మహాస్టలు కార్యనిర్వాహకవర్గము జనవరి ౨౪వతేది శుక్రవారము సాయంత్రము సుమారు ౩గంటలకు శ్రీయుత బొమ్మిరెడ్డివేరరోశయ్యగారి భవనమునందు సమావేశమైరి,

"కమ్మహాస్టలు నూతనభవన ప్రారంభోత్సవము వార్షికోత్సవము, మరియు కమ్మజనసంఘ మహాసభయును యీవార్షికమసంవత్సర మాఘమాసములో జరుపుటకు నిశ్చయించుకొనిరి" ఆహ్వానసంఘముకూడా ఎన్నుకొనబడెను.

ప్రారంభోత్సవము శ్రీనిజాంరాష్ట్ర విద్యాశాఖమంత్రిగారిచే జరుపబడునని తెలియపరచిరి. ఈసమయముననే ఒక గ్రంథాలయముకూడా ప్రారంభించబడును.

ఆహ్వానసంఘాధ్యక్షులు:—శ్రీ వేములపల్లి భాస్కరరావు చౌదరిగారు,

కార్యదర్శి:- శ్రీ చావా వెంకటకోటయ్య చౌదరిగారు.

ఇట్లు

తాతా శీతారామయ్య చౌదరి.

## గోపాలపేటసంస్థానము

### హిందీనిషేధము

(ఒక విలేఖరి)

ఈగ్రామము మహబూబునగరముజిల్లాలో చేరినది. ఇక్కడఒకసంవత్సరమునుండి రాత్రిపాఠశాలనడుచుచుండెను ఆశాలలో హిందీమరియు తెలుగుచదివించుచుండిరి, కొందరువిద్యార్థులు దక్షిణ హిందిప్రచారపరీక్ష ప్రాథమికలోకూర్చుండి అందరుఉత్తీర్ణులయినారు పునఃమధ్యమ పరీక్షలోకూర్చునేకొరకై తయారుచేయుచుండిరి. రాష్ట్రీయ పాఠకులగు సీతభద్రరావుగారు పాఠశాలను నడుపుచుండిరి, వారిప్పుడుఅక్కడలేదు ఇట్టితరుణముచూచి తాలూకదార్ గారు హిందిచదివించగూడదని ఉత్తరువుచేసి ౧౬—౧౭-దివసములాయెను హిందీచదువుట ఆపివేయబడినది.ఈ విషయముపై మాసంస్థానములోవిచారించేదాతలెవ్వరులేరు,

## పెర్కకొండవరం

### కీ. శే. బీ. నర్సింహారావు పంతులవారు

(ఒకవిలేఖరి) ౨౦-౪-౧౩౫౦

సుప్రసిద్ధ గ్రామాధికారియును పెర్కకొండవరంపట్టీ ఆంధ్రజనసంఘ సహాయ కార్యదర్శియునగు బోయినెపెల్లి నర్సింహారావు పంతులవారు ౧౩-౪-౫౦ఫ. బుధవారంఉదయము ౪గంటలసమయమున ౩౫ సంవత్సరముల వయసుననే స్నేహితులనందర గ్రామములో లేనట్లు చూచి అకాలమృత్యువునకువశులైరి.వీరుమంచి మేధాశక్తిసంపన్నులు కులమతవిచక్షణలు వీరికిఅసమ్మతము లు. వీరిఆలోచనలేకుండా రొమ్వలేపనియైనను చేయుటకు ఇష్టపడనట్లు ఎన్నియో నిదర్శనములు కలవు.

## హాజీపురం

### నైజాంరైల్వేబస్సుకండక్టరుల దౌర్జన్యము

ఈగ్రామం మంచిరాలబాసర మోటరరోడ్డు సమీపములో స్టేషన్ మంచిరాలనుండి తొమ్మిది మైళ్ళదూరమునవున్నది. నేను నిన్నపగలు ౨ గంటల బస్సులో (No 90Z) లగిశెట్టిపేటతాలూకానుండి మంచిరాలకుపోవలయునని బస్సెక్కి ఎనిమిదిఅణాలుయిచ్చి టిక్కటుకొంటిని. బస్సుకండెక్టరుగారు టిక్కటుఇస్తు యుద్ధనిధివిషయముగా ఒకపయిస ఇవ్వవలయుననెను. నా వద్దబస్సుఛార్జికంటె ఎక్కువలేదంటిని. యుద్ధనిధియివ్వనిది బస్సుప్రయాణము సాగించవీలులేదనెను. నేనునాగ్రామమునుండి (హాజీపురం) ప్రతిరోజు సర్కారిపనికొరకు లగిశెట్టిపేటకుపోతు యుద్ధనిధిచెల్లించుచూవుండటంవల్ల మరెప్పుడైనఇచ్చగలనంటిని. అటుపైన కండక్టరుగారు మంచిమాటలకు బస్సుదిగకున్న బస్సునుండి గెంటివేయగలననెను. నేనుబస్సుఛార్జిచెల్లించుటమువల్ల దిగటమునకు నిరాకరించితిని. దానిపైకండక్టరుగారు కార్యరూపకంగా బలపరచయత్నించెను. కానినాస్నేహితులు అట్లుకానివ్వక శాంతిపరచిరి. వారిదుర్భాషలు మరియునాపై అత్యాచారాలు చూచినవారిపేరులు ఈక్రిందవ్రాసినాను.

ఇట్లు

పూసుక్కూరు రంగారావు వతందారు

ఇందుకుసాక్షులు:

౧ సంగర్స్ రాంరావు పటువారి, పొన్కల్ తా॥ లగిశెట్టిపేట,

౨ మహమ్మదు యాసుద్దీన్, వతంగారు మ॥ మందపల్లి తా॥లగిశెట్టిపేట

3 మహమ్మదు జమాలొద్దీన్, గిర్దావర్ సా, మందపల్లీ తా॥లగిశెట్టిపేట.

# గోలకొండపత్రిక

విక్రమనామసం॥ర పుష్య శు॥ 3 గురువారము


# వరంగల్ విద్యామహాసభ

వరంగల్ హైద్రాబాదు విద్యామహాసభ నవాబ్ కమాలీయార్ జంగ్ బహద్దరుగారి అధ్యక్షతలో జరిగెను. అందు ఏమితీర్మానాలు కావింపబడెనో ఆవివరాలు మాకు పంపబడలేదు. అందుచేత ఇప్పుడు పత్రికలలోవచ్చిన నవాబుగారి ఉపన్యాసమును గురించిమాత్రమే చర్చింతుము.

నవాబుగారి ఉపన్యాసము వారి సౌమ్యస్వభావమును ప్రకటించుచున్నది. ఒకటి రెండు విషయాలలో అభిప్రాయ భేదాలున్నవి. తక్కిన విషయాలలో వారిధోరణి ప్రశంసనీయముగా ఉన్నది. హిందూ ప్రజాసేవకులు కొందరు ప్రభుత్వమువా రవలంబించిన విద్యాపద్ధతిని విమర్శించినారనియు ఈవిభేదాలు నవరణ యోగ్యముగా లేకపోలేదు అని నవాబుగారు అభిప్రాయమిచ్చినారు. ఈ సౌమనస్యమునకు వారి నభినందించుచున్నాము.

నవాబుగారికి రెండువిషయములలో ఎవ్వరో తప్పు ఆలోచన చెప్పినట్లున్నది. ఈమధ్య హిందూముస్లిం సమస్యను పరిష్కరించుటకు రెండు ప్రయత్నాలుచేయబడెనుఅనిచెప్పినారు. అదినిజమే. మొదటి ప్రయత్నములో మాడపాటి హనుమంతరావుగారు, వైద్యగారును, మీర్ అక్బరలీఖాన్‌గారును, న. బహద్దరుయార్జంగు బ. గారును కలిసి ప్రయత్నించిరనియు అందు ప్రాథమికపాఠశాలలో బాలురమాతృభాషలో విద్యచెప్పించి తక్కిన తరగతులన్నిటిలో ఉర్దూలోచెప్పించవలెనని ఈనలుగురును ఏకాభిప్రాయులైనట్లు నవాబుగారు తమ అధ్యక్షోపన్యాసములో సెలవిచ్చినారు. ఇది మాకాశ్చర్యము కలిగించెను. రావుగారును, వైద్యగారును దీని కొప్పుకొని యుందురా? అని అనుమానపడితిమి. అంతలోనే హనుమంతరావుగారు అట్టి నిర్ణయమేమియు చేయబడలేదని ప్రకటించిరి. కావున ఆయంశము సరికాదనిస్పష్టమగుచున్నది.

ఇక రెండవ ప్రయత్నము "సింగ్ జంగ్ సమాధానము" అనునట్టిది. నరసింగరావుగారు లోయర్ సెకండరీవరకు బాలుర మాతృభాషలో విద్యచెప్పించునట్లును అదియు గ్రామాలలోమాత్రమే ఉండవలెననియు బహద్దరుయారుజంగుగారితో సమాధానపడినట్లు యీయధ్యక్షోపన్యాసములో తెలిపినారు. నరసింగరావుగారింతవరకు యథార్థమెంతవరకో తెలుపలేదు. అయినను ఈ సింగు జంగు సమాలోచనలలో ఎన్నియో విషయాలను గురించి చర్చించినారు. ఒకవిషయములో ఒకరికి పట్టింపుండిన ఇంకొకవిషయములో ఒకరు సడలుకొనుటసహజము ఈసంభాషణలకు మూలము బాధ్యతాయుతప్రభుత్వము. అది అంగీకరించితే తక్కిన ముచ్చటలకు వీలుండును అను సిద్ధాంతముతో వారుమాట్లాడినట్లుమేము వినియుంటిమి. కావున ఆసంభాషణలలోని విషయాలను సమగ్రముగా గ్రహించితే గ్రహించవలసి యుండును లేదా సమగ్రముగా త్రోసివేయవలెను. ఇదియే వారియుద్దేశమని మేము గ్రహించుచున్నాము. కావున ఎవరికి అనుకూలమైన భాగమును వారుతీసుకొని ఉదహరించుట అప్రస్తుతముగానుండును.

హైద్రాబాదు రాష్ట్రములో రెండు విద్యామహాసభలున్నవి. ఈరెంటిని ఏకముగా ఎందుకు చేయకూడదు అని నవాబుగారు శలవిచ్చినారు. సంకల్పముమాత్రము ఉత్తమమైనది. కాని అది సంభవమగుటెట్లు? నవాబుగారు అధ్యక్షతవహించిన విద్యామహాసభలో విశేషముగాప్రభుత్వాధికారులుపాల్గొనుచువచ్చినారు. ప్రజావిద్యా మహాసభలో అధికారులు పాల్గొనలేదు. మొదటిదానిలో ప్రజానాయకులు పాల్గొనినట్లులేదు. రెండవదానిలో ప్రజలకు ప్రభుత్వవిద్యావిధానములోనుండు ఇబ్బందులను — అనగా — ఉర్దూనిర్బంధము, ఖాస్గీపాఠశాలలపై ఆంక్ష, ముల్కీభాషలకు స్థానములేకపోవుట, అఖాడాలపై ఆంక్ష, హిందువులకు మతవిద్యలేకపోవుట, మున్నగు విషయాలపై చర్చించినారు. ఈ విధముగా పరిశీలించుచు చూచిన ఉభయమహాసభలు ఎదురుకోలుగా నడుచుటకుమారుగా పెడమొగము పెట్టుకొని ఒకటి పడమటకు ఒకటి తూర్పుకు నడుచుచువచ్చినవి. ఈరెండును ఏధ్రువస్థానములో కలియునేమోకాని ఇప్పట్లోకలిసేటట్లులేదు. అయినను పైవిషయాలలో సమాధానము కుదిరితే రెండును చాల తొందరగా కలిసిపోవచ్చును.

హైద్రాబాదు రాష్ట్రమునకు ఒక సర్వసామాన్యభాష [Common language) సమాన సంస్కృతి (Common culture) ఉన్నట్లు నవాబుగారు అభిప్రాయపడుచున్నారు. సమాన సంస్కృతికి సమానతకావలెను. గులాములకు ఆఖాలకు సమాన సంస్కృతి ఉండనేరదుకదా? సమానభాష అంటే బహుజనులచే మాట్లాడ బడునట్టిది. అది నూటికి ౫౦ మందిచేత మాట్లాడ బడునట్టి ఆంధ్రము. కాని నవాబుగారి అభిప్రాయమేమో స్పష్టముచేయలేదు. కాబట్టి మాకును ఇంతకన్న యెక్కువగా ఇప్పుడుదానిని చర్చించుటఅనవసరము.

నవాబుగారు పైశ్రేణీవరకు మాత్రమే మాతృభాషలలో విద్యచెప్పించు అభిప్రాయమిచ్చుటలో సంకుచితాభిప్రాయమును చూపినారు. ప్రాచీనములో బిజాపూరు సుల్తానులు, బెంగాలుసుల్తానులు, తమభాషఫార్సీఅయినను మరాటీ బెంగాలీభాషలకు ప్రోత్సాహమిచ్చి కచ్చేరిభాషలనుగా నాటినే యేర్పాటు చేసియుండినసంగతి చాలమంది గమనింపరు. బహుప్రజల భాషలకు స్థానమే ఉండకూడదనియు, విద్యచెప్పించుటలో ప్రజలద్రవ్యమును ప్రజలమాతృభాషలకై వ్యయముచేయకూడదనియు ఎవ్వరును వాదించజాలరు.

పూర్వహిందూచరిత్రను కొంత తిలకించుడు. బెంగాలులో బెంగాలీసాహిత్యమునకు బెంగాలు నవాబులు దోహదమిచ్చిరి. జాన్‌పూరు నవాబులు అవధీభాషను (అయోధ్యలోనిభాషను) ప్రోత్సహించుటయేకాదు మలిక్ మహమ్మద్ జయాసీ అనునతడు ఆభాషలో మొదటి గొప్పకవియని ప్రసిద్ధిగాంచినాడు. యూసఫ్‌ఆదిల్ షా తనకచ్చేరీలో అంతవరకును ఉండిన ఫార్సీని తీసివేసి మరాటీని వ్యవహారభాషగా ఏర్పాటు చేసెను. ఫీరోజుతోగ్లాకున్ను, సికందర్ లోడీయున్న చాలా సంస్కృతగ్రంథాలను ఫార్సీలోనికి భాషాంతరీకరణము చేయించిరి. గోలకొండ పాదుషాఅయిన ఇబ్రహీంకుతుబుషా ఆస్థానములో తెనుగుకవులుండిరి. అద్దంకి గంగాధరకవి తన తపతీసంవరణోపాఖ్యానమును అతనికంకితమిచ్చెను. ఇబ్రహీం కుతుబుషా తెనుగు బాగానేర్చియుండెను.

పైనిదర్శనములు మనకు గుణపాఠము నేర్పుచున్నవి. అట్టియంశములే హిందూముస్లిం ఐక్యతకు స్థిరత్వము కలిగించును. తద్విరుద్ధమైన ప్రయత్నములన్నియు విపరీతపరిణామము కలిగించును.

---

## పాల్వంచసంస్థానము

ఆంధ్రవాఙ్మయ సేవాసమితివారి సన్మానవిశేషాదులు

శ్రీయుత శర్మగారికి, సంస్థానములోని వివిధభాషాసంస్థలతోబాటు అధికసంఖ్యాకులగు కార్యనిర్వాహక సభ్యులయామోదమునుబడసి ఆంధ్రవాఙ్మయ సేవాసమితి పక్షమునగూడతగినరీతిసన్మానమునుజరిపి, ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు ప్రచురించినఆంధ్రభాషాచరిత్రము రెండు సంపుటములను బహూకరించిరి. సమితిసభ్యులు కవులునగు శ్రీముకుంద రామమూర్తి, చిలుకూరి సుబ్బారావు, బెల్లంకొండచంద్రమౌళిశాస్త్రి యామిజాల వెంకటశాస్త్రిగార్లు బూర్గంపాడు పౌరులపక్షమున దుద్దుకూరి వెంకటప్పయ్యచౌదరి, మాజేటి రామచంద్రయ్యగార్లుఅభినందనపద్యములను, పత్రములను చదివిరి. రాజాలని సభ్యులగు, ఉభయభాషాప్రవీణ విశ్వనాథం వెంకటేశ్వర్లు, పన్యాల వెంకటరంగనాథరావు, శతావధాని మారిరామలింగశాస్త్రి, ఉభయ భాషాప్రవీణ పెరవలిలింగయ్యశాస్త్రి, పండితచిలుకూరి శ్రీరాములుగార్లును, తక్కంగల విద్వత్కవులగు బ్ర శ్రీ శతావధాని వేలూరి శివరామశాస్త్రి, శతావధానులు శ్రీమాడభూషి వేంకటరమణాచార్యులు, శతావధానిదోమా వేంకటస్వామిగుప్త, జనాబు మౌల్వీఉమ్రఅలీషాకవి. ఎం. యల్. ఏ. సాగి వెంకటనరసింహం ఎం ఏ. మౌల్వీఅహమ్మదుసయ్యదు సిద్ధిఖీ, సా॥నాయబునాజం ఆబ్కారీ మౌల్వీఅబ్దుల్ రషీదు సిద్ధిఖీసా॥ మొహతెమీంసా॥ తాలీమాత్, మిస్టర్ యన్. దుర్గయ్య, బి. ఏ తహశ్శీలుదారు సిరిపూరు, ఓరుగల్లుమండల ఆంధ్రజనసంఘాధ్యక్షులు శ్రీయుతపర్చరంగారావు, శతావధాని శ్రీపతి త్ర్యంబకరావుగార్లు పంపిన ప్రశంసాపద్యములు, సందేశములుచదువబడెను. జటప్రోలుసంస్థానమందలి కొల్లాపురస్నేహలతాకవితాసంఘపక్షమున శ్రీయుతవాజపేయయాజుల రామసుబ్బారాయుడు బి. ఏ. గారుస్వయముగా విటకువచ్చిఅభినందించదలచియు అనారోగ్య పరిస్థితులలో రాజాలకు పంపినఅభినందనపద్యములుకూడ చదువబడెను. సంస్థాన ఉపాధ్యాయసంఘపక్షమున మౌల్వీఅబ్దుల్ రజాక్ సా॥సదరు ముద్రిసు ఉర్దూలోను, శ్రీవల్లాది వేంకటసుబ్బయ్యగారు తెలుగులోను సన్మానపత్రముల సమర్పించి భగవద్గీత ఖురాన్‌షరీఫు బహూకరించిరి. పూర్వవిద్యార్థిసంఘపక్షమున శ్రీకొండుభొట్లు విశ్వనాథంగారు ప్రశంసాగీతముల చదివి ఖద్దరువస్త్రముల బహూకరించిరి.

---

## అమెరికాలో కాంగ్రెసునుగూర్చిన అభిప్రాయము

కాంగ్రెసు భారతజాతిప్రతినిధియని తలచుట

పాకిస్థాన పద్ధతిని తీవ్రముగ ద్వేషించుట.

అమెరికాలో భారతదేశ వ్యవహారములనుగూర్చి ఏమని తలచుచున్నదియు అమెరికాజాతీయుడగు క్రైస్తవమత ప్రచారకుడు రెవరెండ్ ఏ. కమింగ్ గారు పంజాబు రాష్ట్రములోని కారూరులో ఒకపత్రికవిలేఖరునకు తెలుపుచు ఇట్లుచెప్పినాడు:- "అమెరికాజాతీయులు అనేకులును నామట్టుకు నేనుకూడ భారత జాతీయకాంగ్రెసు భారతీయులకు ఉండే ప్రతినిధిసంస్థలన్నిటిలోను గొప్పదియు, ఏకైకప్రతినిధియని చెప్పదగి యున్నదనియు తలచుచుందుము. ఎదుంకనగా, విశేషించి కాంగ్రెసుమంత్రివర్గములు భారతదేశమును, అందలి జనసామాన్యమును బాగుపరచుటకు తమశక్తికొలదిపాటుపడినారు. గాంధిమహాత్మునియందు అమెరికాజాతీయులకు మనుష్యులలో ఎవరిపైగాని ఉండేగౌరవముకంటె ఎక్కువ గౌరవమున్నది. మరియు వారలకు భారతీయుల ఆశయములయెడ ఆదరణ ఉన్నది."

రెవరెండ్ కమింగ్ గారు పాకిస్థాన పద్ధతిని తీవ్రముగా ఖండించిరి. ఇంత ఉపద్రవకరమైన మరొకపద్ధతిని ఇదివరలో ఎన్నడును పట్టుకొనలేదనిరి. ఆ పాకిస్థానమే ఏర్పడినచో భారతదేశ స్వాతంత్ర్యము దుర్లభమగునని చెప్పిరి.

---

## ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్‌గారి వింత అనుభవము

వారి పార్టీని చూచి దొంగలని భ్రమించుట

ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ గారు తమఅనుచరులలోకూడ వజీరిప్రాంతములో సంచారమొనర్చి జనవరి ౧౯వతేది రాత్రి చాలప్రొద్దుపోయి పెషావరుకు చేరుకొనిరి. మార్గంలో బిజాన్‌కే హేల్ వద్ద వారలనుచూచి ఒకటాంగావాడు బండిపోటు దొంగలనిభయపడి టాంగాను ఉరుకులెత్తించెను.

---

## బంగారిగడ్డ

స్ఫోటకపుబాధ

(ఒకవిలేఖరి)

ఇదిచండూరుపట్టీ తాలూకేశర్కీ అత్రాపుబల్దా జిల్లాసర్ఫెఖాస్‌ముబారికులో చేరియున్న ఒక చిన్నగ్రామము. ఇచ్చటి గృహసంఖ్య ౧౭౦మరియు జనసంఖ్యసుమారు ౧౧-౧౨వందలుగలదు

ఈగ్రామమునందు ఆరునెలలకుపూర్వముస్ఫోటకవ్యాధి మొదలయియుండెను. అప్పటినుండియు ఈవ్యాధి కమక్రమముగా వృద్ధిబొందుచుఇప్పుడు అతితీవ్రముగావ్యాపించియున్నది. ప్రతిదినము కనీసముఒకరిద్దరైనను మృత్యువాతబడుచున్నారు. కావునఇట్టిఘోరవిపత్తునుండి ప్రజలనురక్షించుటకై ప్రభుత్వమువారు ఇచ్చటికి ఒకటీకావైద్యునిపంపించి ప్రజలకందరికి టీకాలుతీయించగలరు.

---

## గ్రంథనిషేధము

హైదరాబాదు (దక్కన్) ఇస్ఫంధారు ౨౫ సిద్దీఖ్ దీన్‌దార్ చెన్ బస్వేశ్వర్ అనువరుడు వ్రాసిన "దావతుల్ అల్లా" అనుఉర్దూగ్రంథము అతిగర్హ్యముగా ఉన్నందున హైద్రాబాదుప్రభుత్వమువారుదానిని నిషేధించినారు.

---

## హైద్రాబాదు బజారు ధరలు

తేది ౨౩-౪-౧౩౫౦ ఫ.

పల్లా ౧కి ౧౨౦ సేర్లుతూకము ధరలన్నీ హాలీలే.

| బియ్యము | పల్లా ౧కి ధర రూ | అ | పై | |
|---|---|---|---|---|
| కిచిడీసాంబర్లు | ౨౩ | ౮ | ౦ | |
| సంబర్లు | ౨౨ | ౦ | ౦ | |
| ఢిల్లీభోగాలు | ౨౨ | ౦ | ౦ | |
| రాంభోగర్లు | బజారులోలేవు | | | |
| నాజర్కాం | ౧౩ | ౦ | ౦ | నుంచి |
| | ౨౧ | ౮ | ౦ | వరకు |
| ఆర్కాటి | ౧౯. ౧౯ | ౮ | ౦ | (కొత్తవి |
| | ౨౦, ౨౦ | ౮ | ౦ | పాతవి |
| కోనామణి | ౧౫ నుండి ౧౭వరకు | | | |
| బుడుములు | ౧౪ | ౮ | ౦ | |
| దేశావరి | ౧౫ | ౮ | ౦ | |
| గోధుమలు | ౧౭ | ౭ | ౦ | |
| బన్సీ | ౧౮ | ౦ | ౦ | |
| లన్కారీ | ౧౩ | ౦ | ౦ | |
| పోటియో | ౧౯ | ౦ | ౦ | |
| ఎర్రగోధుమలు | ౧౫ | ౦ | ౦ | |
| జొన్నలు | ౧౦ | ౦ | ౦ | |
| తెల్లజొన్నలు | ౧౦ | ౪ | ౦ | |
| పచ్చజొన్నలు | ౮ | ౦ | ౦ | |
| మడికట్టుజొన్నలు | ౩ | ౮ | ౦ | |
| సెనగలు | ౧౩ | ౦ | ౦ | |
| కందులు | ౮, ౧౦ | ౦ | ౦ | |
| మినుములు | ౭ ౧౨ ౦ నుంచి౧౦ | ౮ | ౦ | |
| లంకలు | ౧౨ | ౦ | ౦ | |
| సజ్జలు | ౩ | ౪ | ౦ | |
| కుసుములు | ౯ | ౧౨ | ౦ | |
| పప్పు | | | | |
| సెనగపప్పు | ౧౫ | ౮ | ౦ | |
| కంది ,, | ౧ ౪౦ | | ౦ | |
| సిరిసెనగ,, | ౧౭ | ౦ | ౦ | |
| అంక ,, | ౧౧ | ౪ | ౦ | |
| మినుప ,, | ౧౮ | ౦ | ౦ | |
| పెసర ,, | ౧౮ | ౮ | ౦ | |
| బెల్లము | ౧౨ ౦ ౦ ౧౧ | ౦ | ౦ | |
| ఉప్పు | ౧౩ | ౦ | ౦ | |
| ఉల్లిగడ్డ | ౭ | ౮ | ౦ | ౧౦ వరకు |
| తెల్లవరుకు | ౧౨ నుంచి ౨౨ వరకు | | | |
| చక్కెర రమణుము (౪౦ సే) | | | | |
| జావా ,, ,, | ౧౪ | ౦ | ౦ | |
| బొంబాయి ,, ,, | ౧౩ | ౧౪ | ౦ | |
| మద్రాసు ,, ,, | ౧౩ | ౧౫ | ౦ | |
| నిజామాబాదు,, ,, | ౧౩ | ౧౨ | ౦ | |
| మిశ్రచక్కెర ,, పల్ల | ౧౩, ౧౨ | ౮ | ౦ | |
| దర్గాచక్కెర,,(౪౦ సే) | ౧౯ | ౧౨ | ౦ | |
| ఎల్లిగడ్డ ,౧౨సే | ౫ | ౧౨ | ౦ | |
| అల్లం ,, ,, | ౧ | ౧౨ | ౦ | |
| మణుము ౧౨ సే | | | | |
| కొబ్బరినూనె | ౪ | ౮ | ౦ | |
| కుసుమనూనె ,, | ౩ | ౪ | ౦ | |
| నువ్వులనూనె ,, | ౩ | ౧౨ | ౦ | |
| వేరుసెనగనూనె ,, | ౨ | ౧౪ | ౦ | |
| పుంటినూనె ,, | | | | |
| కిరోసిన్ (గ్యాస్),, డబ్బా ౧కి | | | | |
| నెయ్యి దిమణుము ౪౦ సె | | | | |
| చిదరునెయ్యి ,, ,, | ౪౨ | ౦ | ౦ | |
| తెలంగానా ,, ,, | ౩౭ | ౦ | ౦ | |
| వనస్పతి డబ్బా ౧కి | ౧౧ | ౨ | ౦ | |
| బంగారు తు ౧కి | ౫౨ | ౪ | ౦ | |
| వెండి ౧౦౦ తు | ౬౭ | ౨ | ౦ | |
| తు ౧కి | ౦ | ౧౧ | ౨ | |
| సవరిన్ ౧ కికల్దారు రూ | ౨౮ | ౮ | ౦ | |
| మారకం | | | | |
| హాలీకి కల్దార్లు | ౧౫ | ౧౩ | ౦ | |
| కల్దారుకు హాలీలు | ౧౫ | ౧౧ | ౦ | |
| ఆముదాలు బస్తా | ౧౧ | ౪ | ౦ | |
| వేరుసెనగ | ౮ | ౪ | ౦ | |
| బుడ్లు పల్లా౧కి | ౮ | ౪ | ౦ | |
| పప్పు పల్లా౧కి | ౧౨ | ౦ | ౦ | |

గమనిక: —

ధరలు వీలైనంతవరకు సరియైనవిగా తెలుపుచుందుము. అయినను ఏమైన పొరపాట్లుండిన దానికి పత్రికవారు బాధ్యులుకాజాలరు. ఈ నగరాలలో జిల్లాలలో వ్యాపారపు పేటలలోని గొప్పవర్తకులు తమదుకాణముల ప్రకటనలు మా పత్రికలో వేసికొనినవారి వ్యాపారానికి మంచిప్రచారము కలుగును.

## మథోలు సంస్థానం

### రాజకీయ సంస్కరణలయెడ ప్రజల అసంతృప్తి

మథోలుసంస్థానము దక్కను స్టేట్స్ ఏజన్సీలో చేరినట్టిది. దాని వైశాల్యము ౩౯౩ చదరపుమైళ్లు, జనసంఖ్య ౨౮౧౦౦ వార్షికాదాయము రూ౩౫౦౦౦౦, సగటున సంవత్సరమునకు ఖర్చు ౩౯౨౦౦౦ లు. ౧౧౫మంది సైనికులు, ౩౫మంది పోలీసుఫోర్సుగలది. ఈసంస్థానపురాజు చిన్నవాడగుటచే వారిపేర రాజ్యపాలన సాగించుచున్న రాణీసాహెబాగారు ఇటీవల క్రొత్తరాజ్యాంగసంస్కరణము నిచ్చినట్లు ప్రకటించిరి. ఈసంస్కరణలు ఇపుడున్న మంచిస్థితినికూడ చెడగొట్టుచున్నవనియు, కాబట్టి వాటిని వెంటనే అమలుచేయవలదనియు ఒకతీర్మానమును ఆసంస్థానపు శాసనసభయగు అసెంబ్లీలో ఆసంస్థాన ప్రజాపరిషత్తుయొక్క అధ్యక్షుడు జనవరి౨౫వ తేదిన ప్రతిపాదించగా అదిఆమోదించబడినది.

## స్మారకసభ

సికింద్రాబాదు(దక్కను)జనవరి౨౭

చీకోటివీరన్న గారి మరణంబునకుచింతించుచు దక్కన్ మానవ సేవాసమితిపక్షమునను సికింద్రాబాదు పురప్రముఖుల పక్షమునను నొకమహాసభ ౧౯వజనవరి సాయంత్రము మార్కెటువీధి జంపెడువారలనందు శ్రీ మాశెట్టి హనుమయ్యగుప్తగారు యధ్యక్షతక్రింద సమావేశమయ్యెను. పురప్రముఖులు, వర్తకులు యుద్యోగస్థులు విద్యార్థులు పెక్కండ్రు విచ్చేసిరి శ్రీయుత అర్. కె. వాసుదేవ మొదల్యారుగారు అధ్యక్షుని సూచించిరి. శ్రీయుత రాజనరసింహశాస్త్రిగారు బలపరచిరి అధ్యక్షులగు శ్రీ గుప్తగారు కీర్తిశేషులగూర్చి ముచ్చటించిరి. ఎ.వి. దత్తాత్రేయశర్మగారు కీర్తిశేషులగురించి ముచ్చటించిరి. ఎ.వి. దత్తాత్రేయ శర్మగారు కీర్తిశేషులగుటించి వారొనర్చిన సత్కార్యములు, అనాథాశ్రమమునకు, విద్యాసంస్థలకు ప్రజాహితసంస్థలకు వారుగావించిన బహుళోపకారములను సనాతనధర్మ పథావలంబులయ్యు సంఘసంస్కారకార్యములయెడ వారికిగల సమానసద్భావముల విశదీకరించుచు నీక్రిందితీర్మానము నుపపాదించిరి.

"వదాన్యుడును, పరోపకారపారీణుడును విద్వాంసుడును వైశ్యప్రముఖుడునగు మ.రా. శ్రీ చీకోటివీరన్న గారి యకాలపరలోకగమనమునకు చింతించుచు వారియాత్మకు సంపూర్ణశాంతినొసంగ సర్వేశ్వరుని ప్రార్థించుచు నీసభవారు వారి కుటుంబమునకు తమసానుభూతిని తెల్పుకొనుచున్నారు "ఈతీర్మానమునుబలపఱచుచు శ్రీయుత నారాయణం రాజనరసింహశాస్త్రిగారు కీర్తిశేషుల యౌదార్యాదివిషయములగూర్చి విశేషముగా ముచ్చటించిరి. చి॥ అప్పయ్యశాస్త్రిగారు వారొనర్చిన గుప్తదానాదులగూర్చి వారి పరోపకారపారీణతను గూర్చియు తెల్పి తీర్మానమును బలపరచిరి. శ్రీ శ్యామారావుగారు తీర్మానమునుబలపరచుచు సభలోనున్న సభ్యులను ఎల్లరకు నవసరమగు ప్రజోపయోగకార్యములయందు సనాతన ఆధునాతన సంఘ సంస్కార పూర్వాచారాది భేదంబులులేక పాల్గొని మానవసేవజేయుటకు నెప్పుడు సంసిద్ధతవహించి కీర్తిశేషులట్లు భేదంబులను పాటింపక సర్వసమత్వమును వహించియుండిరో ఆట్లేవారికుటుంబమును కూడ నుండవలయునని గోరుచు తీర్మానమును బలపరచిరి. పోలంవీరయ్య యాదవగారు మాట్లాడిరి. సభ్యులందరొక క్షణకాలమునిలచి కీర్తిశేషులందు తమకుగలగౌరవమును వెల్లడించి తీర్మానముల నామోదించిరి.

ఆ. వే. దత్తాత్రేయశర్మ
గౌరవకార్యదర్శి
డి. యం. యస్. సమితి,

### అలీహైదరీ స్టేటుబెంకు

హైదరాబాదు ఇస్ఫందారు ౨౫

మ-ఘ-వ- నిజాంప్రభువుగారు ఫర్మానుద్వారా తాత్కాలికముగా ఆరుమాసాలకుగాను స్టేటుబెంకులో సహాయాధికారిగా అలీహైదరీగారిని నియమించినారు. వారికి నెలకు ౧౦౦౦ కల్దారురూపాయిల జీతములభించును. పైగాఅలవెన్సులు ఇంటికిరాయియుదొరుకును.

## నైజాం రైల్వే ఉద్యోగులు

### ప్రావిడెంటు ఫండు

హైద్రాబాదు ప్రభుత్వమువారు రైల్వేలోని నౌకరులలో ౧౬ఏండ్లకుపైగా నౌకరీచేసినవారికిని ౧౫౹౪ రూ నెలజీతాలుకలిగి మూడేండ్లపైన నౌకరీచేయుచున్న వారికిని ప్రావిడెంటుఫండును ఇచ్చుటకు నిర్ణయించినారు.

## హైదరాబాదుయుద్ధ బాధానివారణనిధి

హైదరాబాదు జనవరి ౨౧

పోయినడిసంబరు ౨౨ వతేదినాటివరకు విడివిడివిరాళాలవల్ల హాలీ రూ ౨౬౬౩౨౬-౫-౧ లును, కల్దారు ౨౪౪౧౯-౪-౦లును, మాసికవిరాళాలవల్ల హాలీరూ ౯౩౬౦-౭-౦ లును, కల్దారు రూ ౬౭౧౩-౩-౦లును హైద్రాబాదు యుద్ధబాధానివారణనిధికి లభించినవి. ఆతేదితరువాత హాలీరూ ౬౨౫౯-౭-౦లును, కల్దారు రూ ౬౩౦-౫-౦లును ఆనిధికిచేరినవి. ఈమొత్తముద్రవ్యమునుండి డిఫెన్సు సెక్రిటేరియటు కార్యాలయంలోని యుక్తడైనగుమాస్తాకు ఇచ్చిన జీతానికి అలెవెన్సుకు హాలీరూ ౧౭౩-౩-౭ లతోకలిసి మొత్తంహాలీరూ ౭౩౫౫౮౯-౧౩-౭ లు. కల్దారు రూ ౨౫౬౫-౧-౧లును ఖర్చుచేయబడినవి. అవిపోను బ్యాంకులో హాలీ రూ ౪౬౭౧౬-౧-౨లు, కల్దారురూ౨౫౬౫-౧-౧ లును మిగిలినవి.

## బహద్దరుయార్జంగు బంధనంఅయితే?

### మేముప్రమనాచేస్తాము

వరంగల్ జిల్లా ఇత్తేహాదుల్ ముస్లిమీన్ సంఘమువారు నవాబు బహద్దరుయారుజంగు బాగారి దిగ్బంధనమో వాగ్బంధనమో జరుగునేమోఅను నవాబుగారిస్వయంప్రకటనను విని అట్లుజరిగినట్లయితే తాముప్రైవేటునవారీ ధాపని (డైరెక్టుఆక్షన్) చేసివేస్తామని ప్రభుత్వమును బెదిరించుచుఒకతీర్మానముచేసినారు

వరంగల్ లోని కొందరుముసల్మాను యువకులు ఈవార్తవిని విచారసాగరములోమునిగి హైదరాబాదులోని బహద్దర్ యారుజంగు బహాగారితోకలిసి మీసేవలో ౧౦౦౦ స్వచ్ఛంద సేవకులను ఇచ్చుచున్నామని వాగ్దత్తముచేసిరట.

### శేషాద్రినాయకస్మారకము

హైద్రాబాదు [దక్కను]ఇస్ఫందారు ౨౫

న్యాయమూర్తి రామచంద్రనాయకుగారి తండ్రిగారైన శేషాద్రినాయకుగారిపేర హైద్రాబాదునగర వై-యం-సి-యస్ లో ఒకహాల్ కట్టించినారు. అందుకుగాను రామచంద్రనాయకుగారు ౪౨౦౦ రూ. ఇచ్చినారు. పైగా అందలికుర్చీలకై ౧౦౦౦ రూ॥ ఇచ్చినారు.

డాక్టరుకిక్లోస్కరు గారుఆహాల్ యొక్క ప్రారంభోత్సవమును ఆదివారమునాడుకావించిరి. రామచంద్ర నాయకుగారుపన్యసించిరి. యుద్ధనిధికి ౧౦౦ రూపాయ లిచ్చుచున్నామని ప్రకటించిరి.



## సభలు—కార్యక్రమములు

హైద్రాబాదు హిందూ ప్రజామండలిపక్షాన ౧ ఫిబ్రవరి శనివారమునాడు హైద్రాబాదు నగరములో గౌలీగూడ సుందరభవనములో సాయంకాలము ౫ గంటలనుండి శంకరావు బూర్గాంకరుగారి అధ్యక్షతలో సభజరుగును. పలువురుప్రముఖు లుపన్యసింతురు.

### శ్రీవైష్ణవ గ్రంథనిలయము

హైదరాబాదు (దక్కన్), ౨౬ ఇస్ఫందారు

విక్రమసం॥ మాఘశు॥ ౫ శనివారము ౩౦-౪-౫౦ ఫసలి సాయంకాలము ౫ గంటలకు విద్వాన్ సరిపల్లి విశ్వనాధశాస్త్రిగారి అధ్యక్షతలో పై గ్రంథాలయపు ౧౫వ వార్షికోత్సవము హైద్రాబాదు నగరములోని సీతారాంబాగులో జరుగును.

శ్రీయుతులు బూర్గుల రామకృష్ణరావుగారు చిపుకుల అప్పయ్యశాస్త్రిగారు, శిరోమణి సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారు మున్నగు పెద్దలు ఉపన్యసింతురు.

### మాతృభారతీ జయంతి

హైద్రాబాదు (దక్కన్), ఇస్ఫందారు ౨౬

ఈ జనవరి ౩౧వ తేదినాడు సాయంత్రము ౩ గంటలకు ప్రతిసంవత్సరమును ఆచారముగా జరుపబడుచున్న మాతృభారతీ జయంతి, హైదరాబాదు బాలికల ఉన్నతపాఠశాలాభవనమున (నారాయణగూడ) బాలికా సంఘపక్షమున జరుగును గాన నెల్లరు విచ్చేయప్రార్థితులు.

### హైదరాబాదు బాలభటులు

హైదరాబాదు జనవరి ౨౫

హైద్రాబాదుబాయిస్కౌటు సంఘమువారి యాజమాన్యములో బాలభటుల జాగీర్దారుకాలేజిస్కౌటుమాస్టరుఅగునారాయణరావుగారియాజమాన్యములో ఈమొహరంసెలవులలో మద్రాసుఅనంతశయనం కొచ్చిన్ ప్రాంతాలకువెళ్ళివచ్చుచున్నారు. గరుడాచారిగారును వారణాసిగారు వీరికిఅనుమతియున్న ద్రవ్యసహాయమున్నుచేసి వీరికృతజ్ఞతలకుపాత్రులైయున్నారు.

# హైద్రాబాదు విద్యామహాసభ

## న॥ కమాల్ యార్జంగుగారి అధ్యక్షత

హైదరాబాదు(దక్కన్)ఇస్ఫందారు ౨౮ గురువారం శ్రీజనవరినాడు వరంగల్ లోన కమలుయార్జంగుబ॥ గారి అధ్యక్షతలో హైద్రాబాదు విద్యామహాసభజరిగెను. అందువారిట్లుపన్యసించి.

"ఈరాష్ట్రములో విద్యా సంబంధములో రెండు చిన్నచిన్న విద్యామహాసభలుండుట విచారకరము. హిందువులలో కొందరు ప్రజాసేవకులు ప్రభుత్వమువారివిధానమును విమర్శించుట వారు తెలియునుకొని వారిఆక్షేపణలు అంతముఖ్యమైనవికావు. ఇటీవల నాలుగు సంవత్సరములనుండి హిందూ ముసల్మానులలోగల రాజకీయ విభేదములను పోగొట్టుటకు రెండుమాడులు గొప్పప్రయత్నములుజరిగినవి మాతృభాష ద్వారా విద్యజెప్పించువిషయములో ఉభయులునుచాలావరకు సమాధానపడియుండిరి. మాడపాటిహనుమంతరావుగారును, న॥ బహద్దరుయార్ జంగు బ॥ గారును, కాశీనాథరావువైద్య గారును, మీర్ అక్బరలీఖాన్ గారును ఒకఆలోచనచేసి ప్రాథమికవిద్య బాలురమాతృభాషలో యుండునట్లును తక్కినవిద్యయంతయు ఉర్దూలోనుండునట్లును అంగీకరించిరని వినియుంటిని. బాలికలకు (మెట్రిక్)వరకు మాతృభాషలో విద్యచెప్పించుచూ ఉర్దూనునిర్బంధద్వితీయభాషగానేర్పించవలెనని పై సమితివారు ప్రభుత్వమునకు తెలుపుకొన్నారని వింటిని. ఆటుతర్వాత నర్సింగరావుగారికిని, బహద్దురు యార్ జంగ్ బ॥ గారికిని సమావేశసమాలోచనలు జరిగెను. అందు ఉభయులును, లోయర్ సెకండరీవరకు గ్రామాలలో బాలురకు మాతృభాషలో నేర్పవలెననియు 3వ తరగతినుండి ఉర్దూను నిర్బంధద్వితీయభాషగా నేర్పవలెనని అంగీకరించినట్లు వింటిని. నగరాలలో పూర్వస్థితియే యుండవలెనని అంగీకరించిరి.

ప్రజావిద్యామహాసభలో ఖాన్గిపాఠశాలల నిషేధమునుగురించియు, అఖాడాల నిషేధమును గురించియు, హిందువులకు మతబోధకావలెనను విషయమునుగూర్చియు చర్చించియుండిరి. హనుమంతరావుకమిటీవారు పైనాటివిషయమై పరిష్కారరూపమును అంగీకరించియుండిరి. ఖాన్గి పాఠశాలలకు వెంటనే సెలవివ్వవలసినదనియు, హిందూముస్లింసంఘర్షణ తక్కువైనవెంటనే ఆ ఖాడాలకు సెలవివ్వవలసినదనియు హిందువులకు మతవిద్యచెప్పించవలసినదనియు నిర్ణయము వచ్చియుండిరి. సింగ్, జంగ్ సంధిఅనంతరము ఉభయవిద్యామహాసభలు ఏల యేకముకాగూడదో, ఉభయసంస్థల అధికారులు ఆలోచింతురుగాక!

మనరాష్ట్రములో ఇంకను ఎక్కువగా సాంకేతిక పారిశ్రామిక. వృత్తిపాఠశాలలు స్థాపించవలసియున్నది. ఇటీవల సర్ అక్బర్ హైదరీగారు ఈరాష్ట్రమునకు ఒకసముద్రపురేవును సంపాదించుటకు ప్రయత్నముజేయుచున్నామని చెప్పిరి. అది మాకు చాలసంతోషము గలిగించినది. రాష్ట్రములోని హిందూముసల్మానులందరును ఏకవాక్యముగా ఎక్కువపరిశ్రమలు ఎక్కువ యంత్రాలయములు రాష్ట్రములోని ఆర్థికస్థితివిచారణ కావింపవలెనని కోరవలెను. ఆర్థికాభివృద్ధికై మతభేదములు ఆవసరములేదు. ఇటీవలఉస్మానియా స్నాతకులసంఘము ఆర్థికమహాసభను కావించినందుకు వారినభినందించుచున్నాను. రాష్ట్రమందలి సాధారణవిద్యార్థులు హైద్రాబాదుచరిత్ర భూగోళము ఆర్థికస్థితియెరుగరు. అసఫ్ జాహి వంశచరిత్రను వ్రాయించవలెను. ఈరెండు శతాబ్దములనుండి హైద్రాబాదులో జరిగిన సాంస్కృతిక సమన్వయము (Cultural Harmony) మతసహనము రాజభక్తిఅనువీటినిగురించి ఈవిద్యామహాసభవారు నొకగ్రంథమును వ్రాయించిన దానికి నేను ఆర్థికసహాయము చేయుదును. రాష్ట్రములోని సార్వజనభాషయొక్క వ్యాప్తికై రాత్రిపాఠశాలలద్వారా వయోజనవిద్యా మూలమున పాటుపడవలెను. ఇట్లుజేసిన మన సమానసంస్కృతికిని దక్కనీజాతీయతకును గొప్పసేవజేసినవారమగుదుము. ప్రభుత్వశాఖలలో అనవసరముగా ఇంగ్లీషు వాడుకొనుచుండుట చాలావిచారముగా నున్నది.

---

# కలియుగభీమ, ఆంధ్రవీర కంఠీరవ ప్రొఫెసర్ లక్ష్మీనారాయణ నాయుడుగారి గొప్పవిజయము!!

సికింద్రాబాదు (దక్కన్) జనవరి ౨౬ నిన్న సాయంకాలము ఇక్కడబాయిస్కౌటు హెడ్ ఆఫీసు పరేడుమైదానముఎదుట కలియుగభీమ, ఆంధ్రవీరకంఠీరవ ప్రొఫెసర్ లక్ష్మీనారాయణనాయుడుగారు బొంబాయికాండో ప్రొఫెసర్ వి. హెచ్. షాగారి సవాలును అంగీకరించి వారుచేసిచూపించినబలప్రదర్శనములను అన్నిటిని వారికంటె ఎక్కువలాఘవముతో తక్కువకాలములోచేసిచూపిరి. డాక్టర్ వి.ఏ.డి. నాయుడు(ఐ.యం.డి). బి.యస్.దివాన్ (హెచ్. ఆర్.టి.ఐ.). సేటుఛోటాలాల్ చతుర్భుజసాహెబ్, చందూలాల్ ఛోటాలాల్ డోంగ్రియా గారలు జయాపజయ నిర్ణేతలుగానుండిరి. చాలమందిజనులు చూడవచ్చిరి.

ప్రదర్శనములఅంతమున వి. హెచ్. షాగారు తాను ప్రొఫెసర్ లక్ష్మీనారాయణ నాయుడుగారియంతటివారు ఉందురనితలచియుండలేదని చెప్పి, బంగారుపతకమును శ్రీనాయుడుగారికిచ్చిరి. మరియు నాయుడుగారికొక పెద్దవెండి కప్పు బహూకరింపబడెను. నాయుడుగారు ఆ కప్పును బాయ్ స్కౌటువారికిచ్చివేసిరి. వి. హెచ్. షాగారు బొంబాయివారు. ఇంతవరకు ఇతరప్రదేశాలలో దిగ్విజయముపొంది ఇకమిగిలినవారు లక్ష్మీనారాయణగారేఅని వారిపైసవాలు వేసి సికింద్రాబాదులో పీఠమువేసియుండిరి. కాని మొన్నవారుఓడిపోయి శ్రీనాయుడుగారిని వేనోళ్ల మెచ్చుకొని వారిశక్తిలో తనకేమాత్రము లేదనిఒప్పుకొని హర్షముతోస్వయముగా శ్రీనాయుడుగారికి బంగారుపతకమునిచ్చిరి.

---

# పిల్లల అపహరణపు వదంతి

సికింద్రాబాదు (దక్కన్), జనవరి ౨౫ ఈమధ్య స్థానికపత్రికలయందు ప్రచురింపబడినపిల్లల అపహరణముసంగతి అసత్యమని సికింద్రాబాదునగర పోలీసువారి విచారణవల్ల తేలినది.

ఈవిషయము చాలమంది పిల్లలతలిదండ్రులకు భయము కలిగింపజేసినది. అందుచే చాలమంది తమపిల్లలను పాఠశాలలకు పంపుటకు వెరచుచుండిరి. దీనివిషయములో ఒకవినోదకరమైనసంగతి నేటిమధ్యాహ్నము మూడుఝాముల సమయమున ఒకముసలివాడు పదేండ్లపిల్లను తనవెంబడి రమ్మనుచుండగా ఒక క్రిశ్చియన్ చూచినాడనియు ఇంతలో జనులు గుంపులుగాచేరి అతనినిపోలీసువారికి అప్పగించిరనియు తెలియవచ్చినది.

(సుబేదక్కన్)

# పాడదీవారి సమ్మె ఆగుట

హైద్రాబాదు(దక్కన్), జనవరి ౨౫ పాడదీజాతివారల కొరకై క్రొత్తగా అంగడి ఏర్పాటయినది. ఈక్రొత్త అంగడిదారులు పాడదీవారికోరికలకు సమ్మతించినారు. బాందగి మొదలగుపేరులతో ఏవిధమైన అక్రమపుపన్నులు తీసుకొనమని వాగ్దానముచేసినారు. ఇంతేగాక దుకాణములో వచ్చినలాభములోనుండి రూపాయిగికి గఅణాచొప్పున పాడదీ జాతివారి విద్యకును తదితరసంఘ శ్రేయములగు కార్యములకును ఇచ్చెదమని వాగ్దాన మొనర్చినారు అందుచే ౨౦రోజులనుండి సాగుచుండిన వీరిసమ్మె నేడు అపుదలచేయనైనది.

---

# సర్ యాఖూబ్ గారి మొదటి ఉపన్యాసము

హైదరాబాదు రాజ్యాంగసచివులైన సర్ మహమ్మద్ యాఖూబ్ గారు శుక్రవారమునాడు వరంగల్ లో జరిగినవిద్యామహాసభలో మొదటిపర్యాయం ఈరాష్ట్రములో ఉపన్యసించినారైనారు, ఆసమావేశములో వారిట్లు పలికిరి:—

హైద్రాబాదుప్రజలు గుడ్డిగా బ్రిటిషుహిందుస్థానమును విద్యారాజకీయవిషయాలలో అనుసరించుకొనగూడదు. హైద్రాబాదు యొక్కయు, బ్రిటిషిండియాయొక్కయు, విద్యావసరములు చాలభిన్నమైనవి. హైద్రాబాదులోప్రభుత్వమున్నూ ప్రజలున్నూ ఒకేదేశమువారు వారిఅవసరాలున్నూ ఒకేవిధమైనవి. ఇప్పటివిద్యలో చాలాలోపాలన్నవి. పూర్వము సాదీవంటి వారినీతి యితర ప్రాచ్య పండితులతత్వము భిన్నమైనట్టివి. ఆనీతియిప్పటిభౌతిక వాతావరణములోలేదు. ఉస్మానియావిద్యాపీఠమువారు తమమాతృభాషలో విద్య చెప్పించుచున్నందున ఒకగొప్ప విద్యావిప్లవముకలిగించినారు

విద్యార్థులు రాజకీయరంగాలలో పాల్గొనరాదు. కిషన్ ప్రసాదు బహద్దరుగారి జీవితచరిత్రను వ్రాయించవలెను. వీరుకొత్తపాతలసంధిగాఉండిరి. వరంగల్ చరిత్రకూడ వ్రాయించవలెను".

గౌ॥ రెసిడెంటుగారి విందు

హైదరాబాదు (దక్కన్), ఇస్ఫందారు ౨౮ శుక్రవారము సాయంత్రము గౌరవనీయులగు రెసిడెంటుగారు రెసిడెన్సీలోటలో ఒక గొప్ప విందును గావించిరి. అందులో హైద్రాబాదుమంత్రులును అధికారులును సుమారు౭౦౦మంది పాల్గొనిరి. మ ఘు.వ. నిజాం ప్రభువుగారు విజయం చేసియుండిరి

# సుభాస్ చంద్రబోసుగారు అకస్మాత్తుగా అదృశ్యులగుట

## వారిపై మేజిస్ట్రేటు వారంటు

జనవరి ౨౭

నేడు కలకత్తానుండి సుభాస్‌చంద్రబోసుగారు ఇంటినుండి అదృశ్యులైనారన్న వార్త వచ్చినది. ఈవార్త పట్టణములో ఉదయం ౧౦ ఘంటలకు తెలియవచ్చెను. వెంటనే చాలా మందిప్రజలు వారియింటికి టెలిఫోనులమీద టెలిఫోనులతో సంగి ప్రశ్నాపరంపరలవైచిరి. మరి కొందరు వారియింటికి స్వయముగా వెళ్ళిరి.

"యునైటెడ్‌ప్రెస్సు" ప్రతినిధితో సుభాసుబాబుగారివద్ద పనిచేయు వారిసోదరునికుమారుడగు అరవిందబోసుగారు చెప్పిన దేమన, సుభాస్‌బాబుగారు మౌనవ్రత మవలంబించి తమ యింటియందు ఒకఅరలో చిరుతపులి చర్మముపైనకూర్చుండి గీతాఖండి పారాయణముచేయుచు భగవధ్ధ్యానములో నుండెడివారని, ఆఅరకొక తెరఏర్పాటు చేయబడెను. అహారమునకై ౨౪ ఘంటలకొకమారు పళ్లెరములో నుంచి అతెరచాటున ఉంచెడివారనియు, వారు పండ్లను, పాలను, జలమును అహారముగా ఉపయోగించుకొనుచుండిరనియు, వారు తమదగ్గరికి ఎవ్వరును రావలదనియు, తమతో ఎవరును సంభాషింపవలదనియు తెలిపినట్లును చెప్పిరి. వారికేమైన అవసరముండుతీరుకు ఒకకాగితము ముక్కపైవ్రాసి తెరఇవతలనుంచెడివారు. వాడుకప్రకారము ౨౬వతేదిన పండ్లుమొదలైనవిఉంచి తెరచాటునవుంచిరి. కాని వాటిలో ఏవిధమైనమార్పుకనపడలేదు. అందువలన ఇంటిలోనివారలతో విచారించి వారలసలహాప్రకారమొకకాగితపుముక్కపై అర్ధగంటలో ఏసంగతి ప్రత్యుత్తరమివ్వవలెననియు, లేనిచో ఆపైన మేము అరలోప్రవేశించెదమనియు వ్రాసి తెరలోనుండి పడవైచితిమి కాని ఏప్రత్యుత్తరము రానందువలన లోపలప్రవేశించిచూడగా వారు కానబడలేదని తెలిపిరి.

ఈసంగతి సుభాస్‌చంద్రబోసుగారి సోదరుడగు శరత్‌చంద్రబోసుగారికి వెంటనే తెలియపరచబడెను. దక్షిణేశ్వరము, వేలూరుదేవాలయములకడకు మనుష్యులుపంపబడిరికాని ఎక్కడను వారిజాడ చిక్కలేదు. అరవిందబోసుబాబుగారు సుభాష్‌బోసుగారు జనవరి ౨౬వ తేదిన తెల్లవారుఝామునసే వెళ్ళియుందురని తలచుచున్నారు.

"యునైటెడ్‌ప్రెస్సు"వార్తతరువాత తెలిసినదేమన, కలకత్తాచీఫ్‌ప్రెసిడెన్సీ మేజిస్ట్రేటు ఖాన్ బహాదూర్ వలీఉల్లాగారికోర్టునుండి సుభాష్‌బాబుగారిపై వారంటు వెడలెను. ఫార్వర్డ్‌బ్లాకునుగూర్చి ప్రచురించినకాగితములలోనున్న ఒకవిషయముపైనను, మహమ్మదలీపార్కుయందు జరిగిన ఉపన్యాసమునుగురించియు సుభాష్‌బోసుగారిపై కేసుజరుగుచుండెను.

కేసు కోర్టులోజరుగుచున్న సమయమున సంతోషకుమారబాబుగారు చెప్పిన వాఙ్మూలములో, సుభాషుబోసుబాబుగారు ఎటుపోయినది, ఎప్పుడుపోయినది తెలియదని అందువలన తీర్పు కోర్టువారి యిష్టప్రకారము జరుపవలెననియు గలదు.

---

## మహాత్ముడు హిట్లరుకు లేఖవ్రాయుట

### ఇండియాప్రభుత్వమువారు దానిని పంపలేదు.

ఇటీవలహిట్లరుకు ఒకలేఖను గాంధిమహాత్ముడువ్రాసి, ఆలేఖను హిట్లరుకు అందజేయవలెనని ఇండియాప్రభుత్వమును కోరినట్లు స్టేట్సుమన్! పత్రికయొక్కఢిల్లీ విలేఖరికి తెలిసింది.

అలేఖలో కేవలమొక అహింసామార్గమున అంతర్జాతీయ వ్యవహారమును పరిష్కరించుకొనువిధానమేగాక, భారతదేశస్థితిగతులగూర్చి కూడనున్నది. అందుచే శత్రుప్రచార మొనర్చుకొనుట కనువగు భావములుకలవని ప్రభుత్వము దానినిపంపలేదని విలేఖరికి తెలియవచ్చినదట.

---

## దొంగయజమానిని ఎద్దుపోలీసుకుచూపుట

ఒకఎద్దుయజమాని పాహాడ్గారా లుస్టేషను గోదాంనుండి ఇనుపకమ్ములను తనబండినిండుగ నింపి యొక్కగేటులోఉండు తనయింటికి తోలుకొనిపోవుచుండగా క్రొత్తఢిల్లీలోలేడీవిల్లింగ్డన్ అస్పత్రివద్దనుండే ఒకపోలీసువాడు అతనిని ఆపబోయెను. అప్పుడుచీకటిగానుండుటవల్ల ఆ సందుచూచుకొని బండివాడు పోలీసువానికిచిక్కకుండ పారిపోయెను. ఇంతలో రైల్వేపోలీసు సబ్‌ఇన్స్పెక్టరు సర్దార్ మాకందుసింగు అక్కడికిచేరి ఆబండినుండి ఎద్దునువదిలెను. అఎద్దు తనయజమానియింటికిపోయిఆగెను. ఆయింటిలో ఆయజమానిదొంగయు మరి ౭ గురునుఉండిరి. వారలందరిని ఆపోలీసుఅధికారి అరెస్టుచేసెను. ఈఅరెస్టుకై ఆపోలీసుఅధికారి లాహోరునగరపు సందుగొందులన్నియు ఎద్దువెంటతిరుగుచుపోయెను.

---

## జాతీయ గ్రంథములు

హైందవ ధర్మవీరులు ౦-౬-౦
పాథమిక స్వత్వములు ౦-౪-౦
కమాల్‌పాషా జీవితము ౦-౧౨-౦
(రెండు భాగములు)
ప్రజలు—ప్రభుత్వము ౦-౬-౦
బౌద్ధ సంస్థానము ౦-౪-౦
కాంగ్రెసు-సంస్థానములు ౦-౬-౦
సంస్థానసమస్యలు ౦-౬-౦
గాంధిమహాత్ముడు ౦-౧౨-౦
(రెండుభాగములు)

సభ్యులకు ప్రత్యేకశెల
వార్షికమూల్యము రు ౧-౮-౦లు

దేశోద్ధారక గ్రంథమాల
సికింద్రాబాదు.

---

గనోరియాబాధలనుండి రక్షించు కొనవలయునన్న

ట్రేడ్ మార్కు

జాండు గనోమిక్చర్ వాడుడు.

చాలకాలమునుండియున్న గనోరియా, దానివలనకలుగు యితరవ్యాధులనుండి అతిశీఘ్రముగా స్వస్థతకలుగజేయు దివ్యౌషధము. యిారోజే పరీక్షించండి

జాండుఫార్మావర్క్సు, లిమిటెడ్ బొంబాయి.
నైజాంరాష్ట్రపు ఏజంట్లు
డి. జె, పారిఖ్ అండుకో, సికింద్రాబాదు.

---

## ప్రపంచ ఖ్యాతిచెందిన సినిమా తారల సలహా ననుసరించండి... మీ శరీర సౌందర్యమును లక్సు టాయిలెట్ సబ్బుతో వృద్ధిపరుచుకొండి

★ "లావణ్యములేని చర్మముతో తృప్తిపడెదరేల? ఈ లక్సు సబ్బును ప్రతిరోజూ ఉపయోగించుటవలన నాచర్మము ఎంతో పరిశుభ్రముగా ఉంటున్నదనే విషయం చాల సంవత్సరాలక్రిందటే నాకు తెలిసినది. నాసలహా వినండి. ప్రతిదినము లక్సు సబ్బునే వాడండి."
క్లాడెట్ కాల్‌బర్ట్—పారమౌంట్.

★ అందముగల సినిమాతారలందరు తమ చర్మ సౌందర్యమును ఎట్లు కాపాడుకొందురని ఉద్రేక పూరితమైన వాతావరణములో కంటికి బాధ కలిగించే మెరుపు దీపముల ప్రకాశములో వెలుపలబడి పనిచేయుచుందురు. కాని తెరపైని వారి ముఖములు చూచినప్పుడు చర్మ సౌందర్యములో ఎప్పుడూ దోషము కాని, మరక కాని కనపడదు.

సౌందర్యకరమయిన చర్మ రక్షణ:

దీని కెంపుసు కటుకు ఒక్కటే. నూటికి తొంభైమంది సినిమాతారలు లక్సునుపయోగించి తమ సౌందర్యమును కాపాడుకొందురు. వారందరికీ లక్సు సబ్బే శ్రేష్టమైనదని తెలుసును. దీని నురుగు చర్మ రంధ్రములగుండా లోపలికి జొచ్చుకొని సౌందర్య భంగకరమైన మలినమునంతయు తొలగించును. అందువలననే లక్సు సబ్బును దాదాపు అన్ని గొప్ప సినిమా స్టూడియోలలోనూ వాడుచున్నారు. ప్రఖ్యాత సినిమాతారల ననుసరించండి! విడవకుండా లక్సుసబ్బు నుపయోగించి మీ చర్మ సౌందర్యము కాపాడుకొండి! లక్సు సబ్బును వాడిన చర్మము ఎంత నునుపుగాను, పరిశుభ్రముగా ఉంటుందో మీకే తెలియును.

★ ఇండియాకు ప్రియమయిన సువాసన.

లక్సు సువాసన హిందూదేశములో అందరిచేత పొగడబడినది. తొమ్మిది రకముల సబ్బులలో మీకు ఎక్కువ ఇష్టమైన సబ్బును కోరుకొనుమని 5,400 మందిని అడుగగా వారు లక్సు సబ్బును కోరుకొనిరి. వారు లక్సు వాసన ఉత్సాహకరముగా ఉండుట వలన దీనినే ఏరుకొనిరి. దీనిని వాడి మీ సౌందర్యమును కాపాడుకొండి! దీని సువాసన ఉత్సాహము కలిగించుటయేగాక సౌందర్యమును వృద్ధిపొందించును.

"ఎందు కిందరు స్త్రీలు చర్మ సౌందర్యమునుగూర్చి శ్రద్ధవహించరు? నేనెల్లప్పుడూ లక్సు టాయిలెట్ వాడెదను. చర్మమును నునుపుగాను, పరిశుభ్రముగాను ఉంచుటలో ఇది శ్రేష్టమైనది." మెదలిన్ కెరాల్

LUX TOILET SOAP

ఇంపైన సువాసనగల తెల్లని సబ్బు
లక్సుటాయిలెట్ సబ్బు

LTS 28 206 TL LEVER BROTHERS (INDIA) LIMITED

---

## శ్రీవైష్ణవ కాఫీ భోజన హోటల్
### హైదరాబాదు

ఇదివరలో గౌలిగూడెము చమన్ బస్‌రోడ్డుపైయున్న మాహోటల్ గోల్‌బంగ్లా సదరు అమీనాకు చేరికి సమీపమున రాసి నెంబరు ఇంటిలోనికి మార్చబడినది. ఫలాహారములు, భోజనము, సినానగదులు, మొదలగు సౌకర్యములు పెంపొందించి, [illegible]చబడినవి. ఒకసారి పరీక్షించినచో ఎల్లప్పుడు రాగలరని నిశ్చయముగా నెరుగలము.

క్లుప్తమాత్రము ప్రత్యేకవర్ణాలు
కంబాళి నరసింహాచార్యులు
ప్రొప్రైటర్

---

## యుద్ధసంఘములయెడ పంజాబు ముస్లింలీగు వైఖరి

### అఖిలభారత ముస్లింలీగుయొక్క ఉపసంఘవిమర్శ

౬ గురుముస్లింలీగుసభ్యుల ఉద్వాసన

భారతదేశమందు రాష్ట్రములలో ప్రభుత్వములు ఏర్పాటుచేసిన యుద్ధసంఘములయెడ ముస్లింలీగుసభ్యులు ఎట్టివైఖరి వహించవలెనను విషయములో అఖిలభారతముస్లింలీగు కార్యవర్గమువారు ఒకతీర్మానముచేసియుండిరి. [illegible] [illegible]

టికిరావలెననికోరుట ఆ రాష్ట్రసంఘవిధిర్మయుండెగా, ఆ సంఘపు కార్యవర్గమువారి ౧౯౪౦ జూలై ౨౮వతేది సమావేశములో ఆమోదించినతీర్మానములో అట్టిసభ్యులు యుద్ధసంఘముల ఆలోచనలలోపాల్గొనరాదని మాత్రమే ఆదేశించబడినది. అగస్టు ౧౫వతేదివరకు ఇకే కఠిననిషేధములేకుండ ఉంచబడినది. అటుతర్వాత కార్యవర్గమువారు చల్లనిమాటలతో ఆ సభ్యులను యుద్ధసంఘాలతో సంబంధమువదలుకొనవలెననికోరినారు. అప్పటికైనను అకార్యవర్గమువారు ఏఏసభ్యులు యుద్ధసంఘాలలో సభ్యులుగా ఇంకనుఉంటుండిరో కనుగొనుటకు ఎట్టియత్నముగానిచేయలేదు. కొబట్టియే వారు అఖిలభారతముస్లింలీగు కార్యదర్శి కోరినపుడు అవసరమైనసమాచారమును తెలియయలేకపోయిరా?"

---

అమ్మకమునకు సిద్ధము
హైద్రాబాదుస్టేటుడైరి 1941
సమస్తమైన వర్తకులకు ఆఫీసర్లకు వకీళ్లకుప్రయాణీకులకు మరియు విద్యార్థులకుపూర్తిగా ఉపయోగపడునది నేటివరకున్న విషయములునుచక్కగా తెలియపరచగలదు ప్రఖ్యాతి చెందినది
ధర ౧ రూపాయి
శ్రీరామాబుక్కుడిపో సికింద్రాబాదు(దక్కన్)

# కాంగ్రెసు సత్యాగ్రహ విశేషములు

## ఐర్లాండు స్త్రీ సత్యాగ్రహానికి మహాత్ముని అనుమతి

విఖ్యాత సోషలిస్టున్ను ఐర్లండు దేశీయుడును అగు బి.పి.యల్. బేడిగారి భార్యయైన ఫ్రెడా గారు సత్యాగ్రహమునకై మహాత్ముని కోరినందువలన ఆమెకు అనుమతినొసంగబడెను.

### స్థానిక సంస్థలలోని కాంగ్రెసు వాదులు

స్థానిక సంస్థలలో నుండు కాంగ్రెసువాదులు సత్యాగ్రహముచేయుటకు వీలులేదు, కాని స్థానికసంస్థలు కాంగ్రెసువిధానానికి భిన్నముగా తీర్మానము లొనరుతీరుకు, స్థానిక సభ్యులట్టి సమయమందు రాజీనామాలనిచ్చి సత్యాగ్రహము చేయవచ్చునని అఖిలభారత కాంగ్రెసు పరిషత్తు అజ్ఞయొసంగినది.

### సత్యాగ్రహమునకై డాక్టరుపట్టాభిగారికి అనుమతి

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘాధ్యక్షులగు డా॥ పట్టాభిగారు గాంధీగారితో ఆంధ్రరాష్ట్రమందు సత్యాగ్రహ వ్యాప్తికై ముచ్చటించిరనియు, దానికి మహాత్ముడు సత్యాగ్రహముచేయుటకు పట్టాభిగారికి సెలవిచ్చిరని తెలియవచ్చినది కాంగ్రెసుకార్యక్రమమును గురించి నాగపూరి కాంగ్రెసుఅధ్యక్షులు బ్రిడెంగుతాకెగారును కార్యదర్శియగు కన్నంవారుగారును గాంధీగారితో సంభాషించిరి.

మహాత్ముడు నూలువడకనివారిని సత్యాగ్రహులుగా ఎన్నుకొనగూడదనియు, నూలువడకు విషయములో సత్యాగ్రహులు తగుశ్రద్ధ చూపించవలెననియు, ఉద్యమము భగవత్ప్రేరితమైనదనియు తెలిపిరి.

ఆరెస్టుకాని స్త్రీలు సత్యాగ్రహమునకై ఢిల్లీకిపోగూడదు. అట్లుచేయుట వారికిచాలశ్రమప్రయాసకరమైనదిగాన వారలు తమతమశాఖలలో నిర్మాణకార్యక్రమము సాగించవలెను. అట్లుచేయుటవలన నిర్మాణకార్యము వృద్ధిజెందుననిరి పురుషులు సత్యాగ్రహమునకు ఢిల్లీవరకుపోవలెను, కాని స్త్రీలలో స్వదేశసంస్థానములలో యుద్ధప్రతికూలపుకేకలు వేయగూడదుఅని గాంధిగారు తెలియపరచిరి

### కోర్టులేచువరకు శిక్షలు

బెజవాడలో ౨౦వతేది సత్యాగ్రహమొనర్చిన శాయన అప్పలస్వామి, రాంపిల్లనాగయ్యగారలకును, ౨౧వతేదినాడు సత్యాగ్రహముచేసిన తమ్మినముత్యాలుగారికి బెజవాడ కలెక్టరుగారు శిక్షలువిధించిరి. అప్పలస్వామి, తమ్మినముత్యాలుగారికి కోర్టులేచువరకు శిక్షయును, రాంపిళ్ళ నాగయ్యగారికి, కోర్టులేచువరకుశిక్షయు, నూటయేబదిరూప్యముల జుర్మానాయు, అదిచెల్లించనితీరుకు మరిమూడువారముల శిక్షయు విధించిరి. జనవరి ౨౨వనాడు సత్యాగ్రహమొనర్చిన జగుపిళ్ళచిన్నగారికి బెజవాడ సబుకలెక్టరుగారు కంకిపాడులో కోర్టులేచువరకు శిక్ష విధించిరి.

### ప్రథమ జర్నలిస్టు సత్యాగ్రహం

శ్రీయుత చిరువోలు రాధాకృష్ణయ్యగారు (అవనిగడ్డలోని ఆంధ్రపత్రికావిలేఖరి) బందలాయిచెర్వు గ్రామములో సత్యాగ్రహమొనర్చిరి. వీరికి మూడుమాసముల కఠినశిక్షయు ౨౫రు. జుర్మానా, జుర్మానాచెల్లించనితీరుకు ౧౫ రోజుల శిక్ష విధించబడినది.

### సరిహద్దురాష్ట్రం

సరిహద్దురాష్ట్రపు ఉత్తరజిల్లాలలోజరుగు సత్యాగ్రహముయొక్క వివరాలను తెలుపుటకు కోరినందున ఆరాష్ట్రీయ కాంగ్రెసుసంఘ అధ్యక్షుడగు ఖాజుఅలీగుల్ ఖాన్ గారు జనవరి౨౫వతేదిన అన్నివివరాలను అబ్దుల్ గఫార్ ఖాన్ గారికి తెలియపరచినారు. గఫూరుఖాన్ గారికిని మహాత్మునికి ఈవిషయంలో లేఖలు నడచుచున్నవి.

### సత్యాగ్రహంలో సోషలిస్టుల వైఖరి

కాంగ్రెసు సోషలిస్టుపార్టీవారు ఈ సత్యాగ్రహంలో పాల్గొనుచునే, రైతుల, కార్మికుల, విద్యార్థుల సంఘటనలకై చేసేపనిచేయుచున్నదని ఆపార్టీ ప్రధానకార్యదర్శియగు జయప్రకాశ నారాయణగారు ఒక ప్రకటనలో చెప్పినారు. కాంగ్రెసు సోషలిస్టుపార్టీయొక్క పద్ధతులను గురించి వ్యాపించిన ఒకవదంతిని ఖండించుచు వారాప్రకటనలో తామిప్పుడు గాంధిమహాత్మునితో సోషలిస్టులకుగల అభిప్రాయ భేదముల సంపుడు వెల్లడించదలచుకొనలేదని చెప్పిరి

### సత్యాగ్రహంచేసిన సభ్యుల స్థానాలలో క్రొత్త వారలు

భారత లెజిస్లేటివుఅసెంబ్లీసభ్యులగు మొసలికంటి తిరుమలరావుపంతులు ... వి. గడ్గిల్, కే.వి. జెఫే, సర్దారు జోగేంద్రసింగుగారు సత్యాగ్రహముచేసినందున వీరలకు ఒకసంవత్సరముకంటె ఎక్కువశిక్ష వేయబడినది. వీరల స్థానములలో ఇతరులఎన్నికలు జరుగునట్లును భారతఅసెంబ్లీ సభ్యుడగు పండిత ప్యారీలాలుశర్మగారు మరణించినందున వారిస్థానమునకూడ ఎన్నికలు జరుగునట్లును గవర్నరుజనరలుగారు అజ్ఞలనిచ్చినారు.

### నాగపూరుసత్యాగ్రహుల ఢిల్లీప్రయాణము

నాగపూరునగర కాంగ్రెసుసంఘసత్యాగ్రహులు జనవరి౧౫వ తేదినుండి గ్రామాలలోతిరుగనిచ్చుచుండుటచే వారలు జనవరి౧౭వ తేదిఉదయం సేవాగ్రామానికిపోయి గాంధిమహాత్మున దర్శించిమాట్లాడిరి. గాంధిగారు వారలనుఢిల్లీకిపొమ్మనిరి వారలు అక్కడరెండురోజులుండి తర్వాతఢిల్లీకిబయలుదేరిపోయినారు.

### కాంగ్రెసుకు ప్రతికూలప్రచారమునకై మదరాసుగవర్నరుసూచన

కాంగ్రెసువారిప్రచారము మదరాసురాష్ట్రములలో సఫలమగుచున్నట్లు మదరాసుగవర్నరు జనవరి౨౧వతేదిన మదరాసురాష్ట్ర యుద్ధసంఘములో ఉపన్యసించునపుడు తెలిపిరి. కాంగ్రెసువారు నాజీతత్వము, ఫాసిస్టుతత్వము నశించవలెనని తాముకోరుచున్నట్లే చెప్పుచు, బ్రిటను విజయమునుకూడ కోరుచున్నట్లెచెప్పుచు యుద్ధంలో బ్రిటనుకు సహాయముచేయక ఆహింసామార్గంలో ఎటువంటిసహాయమైనాచేయవచ్చునని ప్రచారముచేయుచున్నారు పట్టణాలవారు దీనికిప్రతిరేకప్రచారము చేయవలెనని గవర్నరుగారుచెప్పిరి గ్రామస్థులుఅవివేకులనియు. ఈ యుద్ధమువల్లవారిస్థితి ఎంతగామారునది వారలకువిశదముగా తెల్పవలసినపని పట్టణవాసులదనిచెప్పిరి.

## బరోడాసంస్థానంలో విద్యపైఖర్చు

బరోడాప్రభుత్వమువారి వార్షికపరిపాలన నివేదిక ౧౯౪౦ తో అంతమయేకాలానికి సంబంధించినది వెలువడినది. అందులో బరోడాప్రభుత్వమువారు బొంబాయిరాష్ట్రప్రభుత్వమువారిమద్యనిషేధోద్యమానికతోడ్పడి తమరాష్ట్రంలోబొంబాయిరాష్ట్రాని అనుకొనియుండే భాగాలలో మద్యనిషేధము నమలుపరచితిమనిచెప్పిరి, ఈఏటమొత్తముఆదాయము రూ ౨౫౭౪౮౦౦౦ అందులోనుండి విద్యకు రూ ౩౫౩౬౦౦౦లు. వ్యవసాయశాఖకు రూ ౬౫౧౦౦౦లు. వాణిజ్యపరిశ్రమలశాఖకు రూ ౧౬౩౦౦౦లు వైద్యశాఖకు రూ ౬౫౧౦౦౦ లువ్యయమైనవి.

## హైదరాబాదు స్టేటుకాంగ్రెసుఅధ్యక్షుడు గాంధిమహాత్ముని దర్శించుట

హైదరాబాదుస్టేటుకాంగ్రెసుకు పూర్వంలో తాత్కాలికంగా అధ్యక్షులుగనుండిన దామోదరదాసు ముంధడగారు పూర్ణా,బస్మత్ నగరు, ఉమారి, హింగోలి, పర్భణి, మాన్వత్, ఔరంగాబాదు మున్నగుఊళ్లలోతిరిగి సేవాగ్రామానికిపోయి గాంధిమహాత్మునికి జనవరి ౨౫వతేదిన హైద్రాబాదుసంస్థానంలో ఇప్పటిపరిస్థితులను తెలియపరచినారు

## కర్షకకార్మికరాజ్యస్థాపన

### కాంగ్రెసు సామ్యవాది పక్షోద్దేశ్యము

కాంగ్రెసుసోషలిస్టుపక్షముయొక్క ప్రధానకార్యదర్శియగు జయప్రకాశ నారాయణగారు జనవరి ౨౨వతేదిన బొంబాయిరాష్ట్రమంతలి అహమ్మదాబాదునగరమందు కార్మికులమోల ఉపన్యసించుచు, తమపక్షముయొక్క ఉద్దేశ్యము రైతుల,కార్మికులరాజ్యమును స్థాపించుటయేనని చెప్పిరి జమీందారీపద్ధతియు, పెద్దపెట్టుబడులు పెట్టువారలకే అధికారమంతయు ఉండుపద్ధతియు నాశముచేయబడునంతవరకు, కర్షకకార్మికులకు సుఖములేదని వారుచెప్పిరి ఇప్పుడుజరుగుచున్న సత్యాగ్రహమును ఇంకనుఎక్కువతీవ్రముగా సాగించుటఅవసరమనిచెప్పిరి.



## బెంగాలుసెకండరీవిద్యా చిత్తుశాసనము

### కలకత్తావిద్యాపీఠపు సెనేటువారిప్రాతికూల్యము

బెంగాలులో సెకండరీవిద్యను సవరించుటకై ఫజ్లుల్ హక్ గారి ప్రభుత్వమువారొక చిత్తుశాసనమును తయారుచేయించియున్నారు. ఆశాసనము మతభేదజనితమైనద్వేషమువల్ల కళంకితముగానున్నదనియు, విద్యావిషయములలో ఇట్టిశాసనములవల్ల జాతీయతకు అనర్థముకలుగుననియు, బెంగాలులోహిందువులకిది అన్యాయముకలిగించుననియు ఆరాష్ట్రమందు హిందూనాయకులందరును గోలపెట్టుచున్నారు.

కలకత్తావిద్యాపీఠమువారు ఆచిత్తుశాసనమును పరిశీలించి అభిప్రాయమిచ్చుటకు ప్రత్యేకముగా ఒకసంఘమును ఏర్పాటుచేసియుండిరి. ఆసంఘమువారు సవరుచిత్తుశాసనమును వెంటనే ఉపసంహరించుకొని బెంగాలురాష్ట్రమందువిద్యాభివృద్ధికి సంబంధించినవిషయాలను నిష్కల్మషచిత్తముతో పరిశీలించుటకు తగినపరిస్థితిని కలిగించవలెనని అభిప్రాయమును తమనివేదికలోవ్రాసినారు. విద్యావిషయములలో ప్రభుత్వాధికారములోఉండే రాజకీయపక్షాలుమారునప్పుడెల్ల తమతమకనుకూలములగు మార్పులను క్రొత్తపక్షాలు ప్రవేశపెట్టుపద్ధతి పోనంతవరకు విద్యాసంస్కరణము అసాధ్యమనిరి. ఇప్పటిచిత్తుశాసనము ౧౯౩౭ లో ఒక్క భేదాభిప్రాయమైననులేకుండ కలకత్తావిద్యాపీఠమువారు త్రోసివేసిన సూచనలకంటె అన్యాయముగనున్నదనినారు.

బెంగాలురాష్ట్రంలో ఇంతవరకు సెకండరీవిద్యయొక్కవృద్ధికి ప్రభుత్వేతరులప్రయత్నములే తోడ్పడియుండుటవల్ల ప్రజాభిప్రాయమును నిర్లక్ష్యముచేయ వీలులేదని ఆసంఘమువారి నివేదికలోవ్రాయబడినది. దరిద్రులత్యాగములవల్లను ధనవంతులు ఔదార్యమువల్లను లభించిన పెద్దమొత్తములముందు ప్రభుత్వమువారు సెకండరీవిద్యకైఇచ్చినదాన్ని చూచినచో మొత్తముఖర్చులో నూటికి ౧౫ రూపాయిలుమాత్రమే ఇవ్వబడియున్నట్లు తేలుటవల్ల చాలతక్కువ.’’ ఈచిత్తుశాసనాన్ని అచరణకు తెచ్చుచో సెకండరీవిద్యకు ఇపుడుండేసౌకర్యాలు చాలా తగ్గిపోగలవు. రెండేండ్లయి,తర్వాత ఇప్పుడుండేబళ్లకు ఇంతవరకు ప్రభుత్వమువారుచూపిన ఆమోదముతొలగించబడునని చెప్పినందువల్ల బెంగాలురాష్ట్రంలో విద్యాభివృద్ధికి అనర్థముకలుగగలదు. సెకండరీవిద్యకుగాను ఆచిత్తుశాసనము ప్రకారము ఏర్పడదలచిన ఉపసంఘము ప్రజలలో ఎక్కువమందిజనులుండే అనేకశాఖలకు అభిమానపాత్రముకాకుండాపోవును. మరియు ఆదితనవిధులనుకూడ స్వతంత్రముగా నెరవేర్చజాలకుండును అనినివేదికలో ప్రత్యేకసంఘమువారు అభిప్రాయమిచ్చినారు.

ఈనివేదికనుగూర్చి జనవరి ౨౫వ తేదిసాయంకాలము కలకత్తావిద్యాపీఠపు సెనేటుసభలో చర్చజరిగినది. డాక్టర్ డబ్ల్యు-ఏ-జెన్కిన్సుగారు సిండికేటువారు ఆనివేదికనుమరల పరిశీలించవలెననికోరిరి. కానిసభవారు ఆప్రతిపాదనను నిరాకరించిరి. ఇట్లురెండ గంటలచర్చ జరిగినతర్వాత నివేదికనామోదించవలెనని ౫౬మందియుకూడదని ౨౧ మందిఓటులిచ్చిరి. ఇట్లుఆనివేదిక ఆమోదింపపడెను.

## లోహపు త్రివర్ణ చిహ్నముల తగవు

గాంధిమహాత్ముడు గావించినఒకప్రకటనలో పంజాబులో కాగితములతోను లోహముతోనుచేసినత్రివర్ణచిహ్నము అను కొని ధరించుచున్నారనియు, అదితగదనియు అవి ఖాదీతోచేయబడినవేగాని గ్రామజనులయెడ అభిమానమును సూచించవనియు. ఈకష్టకాలంలో కాంగ్రెసువారును, కాంగ్రెసుపైఅభిమానంగలవారును ఈనియమాన్ని పాటించుటవిధియనియు హెచ్చరిక చేసినాడు.

# ఆంధ్రరాష్ట్రముకోరుటకు సమయంకాదు

## డాక్టర్ సి. ఆర్. రెడ్డిగారి అభిప్రాయము

మదరాసులో ఆంధ్రవారోత్సవములలో ఉపన్యాసము

మదరాసునగరములో లా కాలేజికి సంబంధించిన ఆంధ్రసంఘమువారు ఆంధ్రవారోత్సవములను ఏర్పాటుచేసి డాక్టర్ సి. ఆర్. రెడ్డిగారిచే జనవరి ౨౧ వ తేదిన ప్రారంభింపజేసిరి.

ఆసమయమున ఉపన్యసించుచు డాక్టర్ రెడ్డిగారు ఆంధ్రవిద్యాపీఠము తెలుగుజాతీయ సాహిత్యమును, తెలుగుజాతీయ నాట్యములను ప్రోత్సహించుటకు ప్రయత్నించుచుండెనని చెప్పిరి. కథాకళి, వీధినాటకములు, జావామరియు బాలిదీవులలోని నాట్యములు ఇవన్నియు ఒకచేరకపువి అనితనఅభిప్రాయమనిరి. తెలుగువారలు పూర్వవిజ్ఞానోద్ధరణకు ప్రయత్నించుచుండుటయేగాక ఇప్పటికంటే ఎక్కువగా కలిసిమెలిసియుంటుటకు యత్నించుచున్నారని చెప్పిరి.

ఆంధ్రరాష్ట్రము

నేను యుద్ధమువల్ల భారతదేశరాజకీయస్థితి చావనున్నట్లున్నది. దేశములు చావుబ్రతుకులను తేల్చుకొనవలసినపోరాటములో చిక్కియున్నపుడు, మనప్రభుత్వము సంస్కరణములనుగూర్చి శ్రద్ధవహించుటలేదని మనమనుకొనజాలము, మనమిపుడు జ్ఞాపకముంచుకొనవలసిన ముఖ్యతమవిషయమేమన, అఖిలభారతీయసమస్యలను తేగగొట్టకుండ, ఆంధ్రుల కెన్నడుగాని ఇష్టములేనటువంటి జాతీయకష్టములను కలిగించకుండ, ఆంధ్రరాష్ట్రసమస్యనుగురించిచర్చించుట సాధ్యముగాదు. సర్కారులను, దత్తమండలములనుతిరిగి నిజాంగారికీయవలెనని కొందరుకోరుచుండుటవలన, ఆంధ్రరాష్ట్రమునడుగుటకు మరొకచిక్కు కలిగించబడినది, ఆవిషయమును విశదముగా నేను చర్చించనొల్లను. ఈవిషయంలో "హరిజన్" పత్రికలో గాంధిగారు వెల్లడించిన అభిప్రాయము అందరికిని తెలియును. ఆంధ్రులుదానికి ప్రతికూలమైన ఆందోళనప్రారంభించినారు. ఇప్పటికి ఆంధ్రులు ఈవిషయంలో అలజడిచెందవలసినపనిలేదు. నాకుతోచునదిఏమనగా ఆంధ్రరాష్ట్రము కొట్టుకొనిపోయినది. దానిని బైటికితీయుటకై ఇపుడుయత్నించలాభములేదు." అని రెడ్డిగారు చెప్పిరి.

— —





# ఫ్రాన్సు పతనముచే సముద్రయుద్ధపు ఫలితాల మార్పు

## బ్రిటిషు నౌకాశాఖ పార్లమెంటరీ కార్యదర్శి వివరణ

బ్రిటనుపై జర్మనువిమానాల పగటిదాడులు మరల జనవరి ౧౭ వ తేదినుండి విజృంభించినవి. కాని బ్రిటిషుప్రభుత్వంవారు చిచ్చుబాంబులవల్ల లేచేమంటలను చల్లార్చుపద్ధతిని విమానాలదాడులకు గురియయ్యేపట్టణాలలో ౧౬ ఏండ్లకును ౬౦ ఏండ్లకునులోబడినవయస్సుగల ప్రతిపురుషునికి నేర్పించివారలతో పనితీసికొనుటకు ఆజ్ఞలనుచేసినందువల్ల ఇపుడుజర్మనులు వేయుచిచ్చుబాంబులవల్ల నష్టముతగ్గినది.

౧౬వ తేదిరాత్రి వెస్టుఇంగ్లాండులో దాడితీవ్రముగాచేయబడుటచే, అక్కడి రెండు మూడు భవనములుపాడయ్యెను. ఇతరప్రాంతాలలోకూడ ఇండ్లుకూలుటజరిగెను, ౧౭వ తేది పగలు ఈస్టు అంగ్లియాలో ఒకరైలుబండిపై జర్మనువైమానికులు మరతుపాకులను ప్రేల్చుటచే కొందరుప్రయాణికులకుగాయాలయ్యెను ఈస్టుకెంటులోకూడ బాంబులుపడెను. లండను వెలుపలకొద్దినష్టమయ్యెను. ఆనాటిరాత్రి దక్షిణవేల్సుపై తీవ్రమైనదాడి జరిగెను. కొన్నియిండ్లుపాడయ్యెను. డెవన్‌లో బాంబులుపడి కొందరుమరణించిరి, చాలాయిండ్లుపాడయ్యెను. స్వాన్సియాలోకూడ తీవ్రమైన దాడిజరిగెను, ఇక్కడ రెండు శత్రువిమానాలు క్రిందకూల్చబడినవి. ౧౮వ తేదిరాత్రి లండనుపై దాడియేలేదు. ౧౯వ తేదిపగలు ఒక్కజర్మను విమానము బ్రిటనుపైకివచ్చెను. ఆనాటిరాత్రి వెస్టు ఇంగ్లాండులో ఒకపట్టణముసమీపంలోకిని, పడమటి మిడ్లెండుమీదికి, ఈస్టు అంగ్లియామీదికిని జర్మనువిమానాలువచ్చి బాంబులువేసినవి. ఈ రాత్రి సౌత్ హాంప్టనుపై ఎక్కువదాడిజరిగెను, కానినష్టముతక్కువ మొత్తము ౫ జర్మనువిమానాలు క్రిందకూల్చబడినవి.

పోయిన డిసంబరులో జర్మనువిమానాల దాడులచే ఇంగ్లాండులో ౩౭౯౩ మంది మరణించిరి, ౫౦౪౪ మందిగాయపడిరి అనిబ్రిటిషుప్రభుత్వము వారుప్రకటించినారు.

బ్రిటిషువిమానాలు జనవరి ౧౭వ దిపగలు మాత్రము హాలెండు సముద్రంలోఉండిన శత్రునౌకలపై బాంబులువేసినవి ఒకఓడమునిగిపోయెను. ఆరాత్రి మెరుములుఎక్కువగానుండి ఆటంకమగుటచే బ్రిటిషువిమానాల దండయాత్రలు సరిగాసాగలేదు. అప్పటికిని బ్రెస్టు, షెర్బోర్గు, ఫ్రాన్సులో జర్మనుల క్రిందఉండేభాగంలో రెండువిమానాశ్రయాలు బ్రిటిషుబాంబులదెబ్బలరుచిచూచెను. ౧౯వ-౨౦దినాడు జర్మనీపై బ్రిటిషు విమానాలదాడులులేవు.

జర్మను ఫ్రెంచివారి ఓడరేవులను వశపరచుకొనువరకు సగటునవారానికి ౪౧౦౦౦ టన్నుల పరిమాణపు బ్రిటిషుఓడలు జర్మనులచే సముద్రంలో ముంచబడుచుండ, ఆటుతర్వాత మొదలుకొని సగటునవారానికి ౯౦౦౦౦ టన్నుల పరిమాణపుబ్రిటిషుఓడలు సముద్రంలోముంచబడుచున్నవి అని బ్రిటిషునౌకాశాఖమంత్రియొక్క పార్లమెంటరీకార్యదర్శి సర్ ఆర్థర్‌సాల్టరుగారు జనవరి ౧౯వ తేదిన రూటరువిలేఖరికి తెలిపినారు. "ఈ నష్టాలను కొద్దికాలంలో భర్తీచేసికొనుటకునమ్మకమైనసౌకర్యము ఈలోగాపనివెళ్ళదీసికొనుటకు తగినసహాయములభించుచో, భవిష్యత్తువిషయమై మేముధైర్యమువహించి ఉండవచ్చును" అని వారుచెప్పిరి.

— —

సంవత్సరము ... రూ
... హాలీ రూపాయలు
ఆరుమాసాలకు
౩ రూపాయలు
బ్రిటిషిండియాలో
సం॥చందా
... రూ. ... శిల్లారు.
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము.

# గోలకొండపత్రిక

# Golkonda Patrika

The only
Popular Paper
That reaches
The masses
In the Dominions

Best Medium
for
Advertisement

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

*Volume* 15 Hyderabad-Dn. Thursday 30 January 1941 *Number* 74


# రుమేనియాలో అల్లరులశాంతి

## అల్లరుల కారణంగూర్చి భిన్నాభిప్రాయాలు

రుమేనియాలో ఈసారి విపరీతమైన అల్లర్లు జరిగి తుదకెట్లో అణగగొట్టబడినవి.

రుమేనియాదేశీయ శాఖాంగమంత్రిగా వున్న జనరల్ పెట్రో విసెస్క్యూనున్నూ, అతనితోకలిసిపనిచేస్తున్న బుఖారెస్టు పోలీసుప్రధానకార్యాలయపు లీజినరీలు కొందరినిన్నీ తొలగించుటచే దీనికి ముఖ్యకారణమని కొందరన్నారు. లీజినరీలు భవనంవిడిచిపెట్టడానికి నిరాకరించిరి. వారిని బలవంతంగా తొలగించడానికి జనరలు ఆంటొనెస్క్యూ ఉత్తరువుచేసెను. కొన్నివేల మంది విద్యార్థులు, పనివాళ్లు లీజనరీలకు సహాయపడిరి, కార్యాలయంలోవున్న లీజినరీసేనలపై తుపాకులుప్రేల్చిరి. సైన్యదళాలు లీజనరీలపై మరఫిరంగులనుప్రేల్చెను. టాంకులనుకూడ తీసుకువచ్చిరి. ఉభయపక్షాలలోను చాలామంది చనిపోయిరి. ఈసంఘర్షణలో లీజనరీలబలం ఎక్కువగావున్నందున సైన్యదళాలు లేతబారక్సులకు మరలిపోయినవి. అశాంతిపెరుగుతున్నందున జనరల్ ఆంటొనెస్క్యూ అన్ని లీజనరీక్లబ్బులను ముట్టడిచెయ్యడానికి ఉత్తరువుచేసెను. దీనిపై ఐరన్ గార్డు సేనలు తీవ్రంగా ప్రతిఘటించడానికి సిద్ధపడిరి.

రుమేనియాలో సంపూర్తిగా ఐరన్‌గార్డు ప్రభుత్వాన్ని ఏర్పాటుచేయాలని ఆందోళనయే అల్లరులకుకారణమని లండనులో రుమేనియా రాయబారి కార్యాలయంవారు తెల్పినారు.

ఈకల్లోలపరిస్థితి తెచ్చిపెట్టుటకు కారకులు బ్రిటిషువారేనన్న కొన్ని నేరారోపణలుసైతంబయలుదేరినవి.

రుమేనియాలో జరిగినసంఘర్షణలన్నీ, హోరియాసీమా జనరల్ పెట్రోవిసెస్క్యూ యిద్దరి నాయకత్వంక్రిందా ఐరన్‌గార్డుదళాలు ప్రభుత్వాధిపతిఅయిన ఆంటొనెస్క్యూపైన తిరగబడడంవల్ల జరిగినవేనని ఇప్పుడు స్పష్టపడుతున్నది. రుమేనియాలోవున్న ఐరన్‌గార్డుదళాలకు జనరల్ ఆంటొనెస్క్యూ వాస్తవమయిన స్నేహితుడుకాడని తిరుగుబాటుదారులు వాదిస్తారు.

జనవరి ౨౦వ తేదినాడు అల్లరులుజరిగినతరువాత జర్మనుసేనలు బుఖారెస్టులో ముఖ్యభవనాలను ఆక్రమించెను. రుమేనియాలో జర్మనుసేనలపై తిరుగబడినవారికి మరణదండనవిధించుచు రుమేనియన్ అధికారులు ఉత్తరువు జారీచేసిరి.

జనవరి ౨౧వ తేది రాత్రి బుఖారెస్టులో రుమేనియన్ సేనలకు అయిదువందలమంది ఐరన్‌గార్డులకుమధ్య దొమ్మియుద్ధం చాలాదీర్ఘకాలం వరకు జరిగి, మరఫిరంగులు, టాంకులు, ఉపయోగించబడినవట. రాష్ట్రాలలో అనేకనగరాలలోకూడా సంఘర్షణలు జరిగినవట.

అందుపై ఆంటొనెస్క్యూ రుమేనియాలో సైనికపరిపాలనను ప్రకటించెను.

పరిస్థితిని శాంతిపరచడానికి జనరల్ ఆంటొనెస్క్యూ ఐరన్‌గార్డు నాయకులతో రాయబారాలుకూడ ప్రారంభించిరి.

జనవరి ౨౨వ తేదినాటికి బుఖారెస్టులో ఏర్పడిన కల్లోలపరిస్థితిని జనరల్ ఆంటొనెస్క్యూ కొంతవరకు స్వాధీనంక్రిందికి తీసుకురాగలిగెను.

కాని బుఖారెస్టులో ౨౨వ తేదినిరంతరపోరాటం ఆగలేదు. వివిధరాష్ట్రాలనూ రాజధానికిమధ్యవున్న రాకపోకసౌకర్యాలన్నీ తెగనరికివేయబడినవి.

శాంతిభద్రతలను నెలకొల్పడంలో రుమేనియన్ ప్రభుత్వదళాలకు జర్మన్ సైనికదళాలు సహాయపడ్డాయన్ని ఒకవార్తవచ్చినది.

సహాయంసాకుతో బుఖారెస్టులోని అనేకనగరాలను ప్రస్తుతంజర్మన్ సేనలు ఆక్రమించుకొనివున్నవి.

జనవరి ౨౪వ తేదినాడు జనరల్ ఆంటొనెస్క్యూ విప్లవకారులపై చర్య తీసుకొనవలసినదిగా సేనలకు ఆజ్ఞాపించెను.

"విప్లవకారులతో సమాధానానికి రావడానికి నేనుచేసినయత్నాలు విఫలమైనవి. ప్రభుత్వాన్ని పడగొట్టే ఉద్దేశంతో వెనుకటిస్వదేశశాఖామంత్రి సిద్ధంచేసిన మరఫిరంగులనూ ధరించి తిరుగుబాటుదారులు ప్రధానమంత్రి కార్యాలయం మున్నగు ప్రభుత్వభవనాలమీద కాల్పులుచేసిరి. వీరిలో చాలామంది బాధ్యతయెరుగని యువకులు. అన్నిచోట్ల వీరు అధికారులకు వశమవుతున్నారు. పరిస్థితి అదుపులోనికివచ్చింది. రుమేనియాజాతి అంతాతమ ప్రభుత్వానికి, సైన్యానికి, రాజుకూ తోడ్పడునని విజ్ఞాపనచేస్తున్నాను" అనిఆంటొనెస్క్యూఅన్నాడు.

ఐరన్‌గార్డుతత్వ ఆధారముపై ఒకక్రొత్తపార్టీని ఏర్పాటుచేసుకున్నట్లు జనరల్ ఆంటొనెస్క్యూ మరిఒకప్రకటన చేసెను. "ఈరోజునుండి ఈపార్టీ నావ్యక్తిగత నాయకత్వంక్రింద పనిచేస్తుంది. ఈరోజునుండి రుమేనియాలో ఒక నూతనవ్యవస్థఏర్పడుతున్నది" అనిఆంటొనెస్క్యూ అందులో తెల్పినాడు.

౨౪వతేది ప్రకటించబడినఒకఆజ్ఞ ప్రకారం రుమేనియాలో ఉన్న ఆయుధాలు, మందుగుండుసామగ్రులు మున్నగునవన్నీ అధికారులహస్తగతంచెయ్యాలి. సమావేశాలన్నీ నిషేధించబడినవి. లేకుంటే తీవ్రమైనశిక్షలు విధించబడుతాయని ప్రకటితమయినది.

బుఖారెస్టు ప్రజలలో భీభత్సంకలుగజేసిన గుంపులు ౨౪వతేది నిరాయుధంచేయబడినట్లు ప్రకటన తెలుపుచున్నది.

రుమేనియాకు క్రొత్తజర్మను రాయబారిఫాన్ కిల్లింజర్ ౨౪వతేదిఉదయంబుఖారెస్టుకుచేరెను.

జనవరి ౨౫వతేదిన రుమేనియాప్రభుత్వం ఈరోజు బల్గేరియా, సోవియటు రష్యాలతోవున్న సరిహద్దును మూసివేసినది. అల్లరులను అంతంచేయడానికికూడా ప్రభుత్వం మరికొన్ని తీవ్రచర్యలనుకూడా అనులుపరచినది. సరిహద్దులుదాటి పారిపోవడానికిప్రయత్నిస్తున్న తిరుగుబాటుదారులను కొందరినిపట్టుకొని అరెస్టుచేసిరి. చాలామంది ఎట్టిఅటంకమూలేకుండా బల్గేరియావారి డొబ్రూజాలోఉన్న ఉత్తరజిల్లాలలోకి పారిపోగల్గిరి.

ప్లోయెస్టీనె ఉత్పత్తిఆయే కేంద్రం ఈ పట్టణానికి, బుఖారెస్టుకూమధ్యవున్న నూనెగొట్టాన్ని ఐరన్‌గార్డు సభ్యులు నరికివేసిరట.

ఐరన్‌గార్డు దళాలకూ ఆంటొనెస్క్యూ అధ్వర్యంక్రిందవున్న ప్రభుత్వదళాలకుమధ్యజరిగినసంఘర్షణలలో కొన్నివేలమంది తమప్రాణాలనుకోల్పోయారు. గురువారంనాడు ఉదయము ౯,౧౦ గంటలమధ్య రుమేనియాప్రభుత్వ సైనికదళాలు జరిపినచర్యతో అధికారాన్ని సంపూర్తిగా కొట్టివేయాలన్న ఎత్తులునిష్ఫలమైనవి.

బుధవారమురాత్రి భయంకరమైనసంఘర్షణలుజరిగినట్లువిధీవిరామంలేకుండా మెషీన్‌గన్సు ప్రేలినట్లు, ఆకాల్పులసందర్భములో యూదుప్రాంతములోవున్న అనేకదుకాణాలు లూటీచేయబడినవి. మరికొన్ని తగులపెట్టబడినవి. మరుసటిరోజు మధ్యాహ్నమయ్యేసరికల్లా కాల్పులు ఆగిపోయినవి.

ఐరన్‌గార్డు నాయకుడు హోరియాసీమా, ఇదివరలో దేశీయశాఖామంత్రిగా పనిచేసిన పెట్రోవిసెస్క్యూ, ఫికారాకుమారుడూ ఇంకా కొందరు ప్రభుత్వముపై తిరుగుబాటును లేవదీశారన్న నేరముక్రింద అరెస్టుచేయబడిరి.

ఇట్లు జనరల్ ఆంటొనెస్క్యూ ప్రభుత్వంమీద అయిదురోజులు తిరుగుబాటుజరిపి ఐరన్‌గార్డులు విఫలతపొందినతర్వాత మిలిటరీపోలీసు గస్తీదళాలు రుమేనియా చరిత్రలో ఇదివరకు ఎన్నడూ ఎరుగనంత తీవ్రంగా అన్వేషణలు జరుపప్రారంభించెను. ఇంకాస్వేచ్ఛగాఉన్న విప్లవనాయకులు అరెస్టు చేయబడుతున్నారు. రహస్యంగా ఉంచబడిన ఆయుధసామగ్రులు స్వాధీనము చేసుకొనబడుతున్నవి.

బుఖారెస్టులో కొన్ని జిల్లాలలో ఉంచబడిన మిలిటరీలమినహా మొత్తంమీద జీవితం మామూలుగా సాగిపోతున్నది. రైళ్లుమళ్లీ నడుచుచున్నాయిగాని సాధారణపౌరులు ప్రయాణానికిముందు అధికారుల అనుమతి పొందవలసినదిగా కోరబడింది.

# అమెరికాకు జపానుహెచ్చరిక

## పడమటిపసిఫిక్కు ప్రాంతం జపానుది

జపానువిదేశాంగమంత్రిప్రకటన

తూర్పు పసిఫికునుకాక చీనాదేశాన్నితనపరిధమరక్షణశ్రేణిగా అమెరికాపరిగణించినంతకాలం అమెరికాతో జపానుకు స్నేహసంబంధం అసంభవమని జపాను విదేశాంగమంత్రి మట్సుఓకాగారు దిగువశాసనసభ బడ్జెటుకమిటీముందు జనవరి ౨౬వ తేది ఉపన్యసించుచు నిర్మొగమాటంగా చెప్పినాడు.

మట్సువోకా, ఇటీవల జపానుఉద్దేశాలను ఖండిస్తూ కార్డెల్‌హాల్ చేసినప్రకటనను మనస్సులోపెట్టుకొని మాట్లాడినట్లు కనపడ్డాడు. "పడమటిపసిఫికులో పైచేయిసంపాదించాలని జపాను ప్రయత్నించడం పొగరుబోతుతనమని అమెరికాఅనడం తెలివిమాలినతనం అనిపించుకుంటుంది" అని ఇతడన్నాడు.

మట్సువోకాఇంకా ఈవిధంగా ఉపన్యసించెను "పడమటిపసిఫికుమీద జపానుఅధికారం సంపాదించడం ఒక్కజపానుకోసమేకాదు. మానవజాతి అంతటిక్షేమంకోసమే అమెరికాకు నచ్చచెప్పటకు నేనుశక్తివంచనలేకుండాప్రయత్నిస్తాను. అయితేబుజ్జగింపులవల్ల ఇదిసాగదు. అచంచలమైన పట్టుదలవల్ల జరుగవలసివున్నది.

జపానుజాతీయబలము హరించిపోతున్నదనేపొరపాటు అభిప్రాయమే అమెరికావైఖరి తీవ్రతరంకావడానికికారణం. అయితేఇంతకంటే సత్యదూరమైనది ఇంకొకటిఉండదని జపానువారు చూపించవలసిఉన్నది.

యూరోపీయయుద్ధంలో అమెరికాపాల్గొన్నప్పుడు మూడురాజ్యాలసంధిపట్ల జపానుబాధ్యతనుగురించి మాట్లాడుతూ మట్సువోకాగారు ఈవిధంగాఅనినారు. "జర్మనీస్వయంగాఅమెరికాఖండంమీద దెబ్బ తియ్యడానికిముందు ఒడంబడికలోని ౩వ నిబంధన అమలుచేయబడవచ్చును. అప్పుడుజపాను తనసర్వస్వాన్నిఒడ్డినుండుకురావలసిఉంటుంది. కాబట్టి అప్పుడుజపాను సాధకబాధకాలుఆలోచించుకోవలసిఉంటుంది. ఏమయినప్పటికి జపానుతన బాధ్యతలపట్ల వెనుకంజవెయ్యదు"

తనంతటతానుగా జపానుయుద్ధంలో ప్రవేశిస్తుందాఅనే ప్రశ్నమీద మాట్లాడుతూ మట్సువోకా ఒడంబడికలో సంతకాలుచేసిన మూడురాజ్యాలూకలిసి సలహాచేస్తాయనీ, అయినాజపానువారు తమస్నేహితులు చిక్కులలోఉన్నప్పుడు సహాయంచేసేస్వభావం కలవారనీ ఇంగ్లండుజపానుల స్నేహసంధి చరిత్రలో ఇదేకనబడుతుందనీఅన్నాడు.

"యూరపీయ యుద్ధంలో అమెరికాప్రవేశిస్తే జపానుఏమిచేస్తుందనేప్రశ్న జపానులో ఎవ్వడూ వెయ్యనేవెయ్యడు' అనిమట్సువోకా అన్నాడు.

శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం
సుల్తాన్‌బజారు, హైదరాబాదు (దక్కన్)

"వైద్యరాజ శ్రీడాక్టరు దంటుసుబ్బావధానిగారు" "ప్రాచీనవిజ్ఞానరక్షణ" అనువిషయముపై శుక్రవారం ౩౧వ జనవరినాడుసాయంత్రం అయిదున్నర గంటలకు ఉపన్యసింతురు. ఆంధ్రసోదర సోదరీమణులు సకాలమునకు దయచేయప్రార్థితులు.

కార్యదర్శి.

### యూనానీ నివేదిక

హైదరాబాదు(దక్కన్) ఇస్పందారు ౧౯ ౧౩౪౯ ఫసలీలో యూనానీ వైద్యశాలలలోని ఏర్పాట్లు మంచివిజరుగుటచేత నిజామియా తిబ్బీకళాశాల దేశములోఎచ్చటనులేనట్టి అపూర్వమైనసంస్థగా ఏర్పడినదని ప్రభుత్వమువారు తెలుపుచున్నారు. అచ్చట ౧౦౦మందిరోగులు నివాసముచేసి చికిత్సపొందుట కేర్పాట్లుచేసినారు. హైద్రాబాదునగరంలో ౨౦ సహాయముపొందునట్టియు ౧౦ సర్కారివియుఅయిన యూనానీ వైద్యాలయాలున్నవి. జిల్లాలో౭౭కలవు. వీటిఅన్నింటిపై యీ నివేదికాకాలములో ౩౭౭౪౧౫ రూపాయీలు వ్యయమైనవి.




Printed and Published by, G. Ramakrishna Reddy at the Golkonda Power Press. Hyderabad Dn, Editor- S. Prathapa Reddy B. A B.L.